రుఁడు - చందమామ - కడియము ఇత్యాది. ఒక్కఁడు ఇత్యాదీనాం మహత్త్వ మత్వేపి విధానాన్న దోషః. (అహో. ౩౫౧ పు.) ఈయహోబలపతిమార్గము సరి కాదు. నిషేధము దేశ్యశబ్దమాత్రవిషయక మగునపుడు విధియు దేశ్యమాత్ర విషయకమె కావలయును. కానఁ దద్భవశబ్దముల రూపసాధనమును జింతామణి వచియింపలేదనవలసివచ్చును. గృధ్రము తద్భ - గద్ద, చణుఁడు - తద్భ - జాణ - గాయనుఁడు - తద్భ - గాణ - కుడ్యము - తద్భ - గోడ - స్నేహము - తద్భ - నెయ్యము - చూర్ణము - తద్భ - సున్నము, మున్నగు ననేకవైకృతశబ్దములకు గతి లేకపోవలసివచ్చును. మఱియు 'పగతుఁడు - అల్లుఁడు - మున్నగు ననేకదేశ్యశబ్ద ములును పుంలింగసములు లేకపోలేదు.

> ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱచుగ స్త్రీసమంబులుం గ్లీబ సమంబు లయియుండు. ౨.

బాలవ్యాకరణ వివరణము. ౧౯౯ I విషయము.

> స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబు ను, గ్లీబసమత్వాతిదేశంబుచే ముపర్ణకంబు నగునని యెఱుంగునది. అన్న-మిన్న-అద్ద గద్ద-జాణ-గాణ-ఓడ- గోడఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము-నెయ్యము- అల్లము-మొల్లము-సున్నము-సన్నము-ఇత్యాదులు క్లీబ సమంబులు.తఱచుగ ననుటచేఁబుంలింగతుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము. కొమరుఁడు - చందు రుఁడు - జముఁడు - కందుఁడు ఇత్యాదులు.

ములు. ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుకయేనియు లేదు నీదెసన్. (విరా. ౧ ఆ. ౨౮౧ ప) ద్విపద. కుటిలవేషంబున గొల్లనిభాతి (బసవ. ౧౧ ఆ. ౧౧౨౦) క. తా నప్పుడు గొల్ల మెచ్చెఁ దనకులకాంతన్ (పంచ. ౧ ఆ. ౪౫౫ సూ. రా. ని.) ము.దుక. చ...ఎట్టుగాఁ। గడఁగితి మూఁడుకాళ్ళముదుకన్ వరియింప (జై. ౪ ఆ. శ. ర.) ముదుకఁడు.........క. ముదుకం డయ్యును గుమారమూర్తింబోలెక (ద్రోణ. ౧ ఆ. శ. ర.) ఉ...మున్ను గొంటిమేఁ।వన్న నదండయొక్క మగవాఁడిడ (ఆము. ౧ ఆ. ౧౪) ద్విపద. ఎంగిలిపాల్ద్రావి రేవంబు లేక (బసవ. ౭ ఆ. ౩౨) చ........పేరుకంకుఁడేఁ।వపుఁగొలువైన నాకు నిలువ న్మది.........(విరా. ౧ ఆ. ౧౯౭) గీ. ఒకు లెఱుంగరు నన్నని యునికి మోస। (అను. ౧ ఆ. ౨౧౪) క. వగతి మోసంబు లేదె యెవ్వరికైనక (మార్కం. ౭ ఆ. శ. ర.) ఇట్టివి మిశ్ర స్థితి కింకను బెక్కులు ప్రయోగములుగలవు.

సంజీవని. ౧౮౯ I విష:—అర్థములు:— మిన్న = శ్రేష్ఠుఁడు, అద్ద = సగము, గద్ద = గృధ్రము, జాణ = నేర్పరి, గాణ = పాటకాఁడు, పాటకత్తె, నెయ్యము స్నేహము, మొల్లము = అధికము, జముఁడు = యముఁడు, కందుఁడు = స్కందుఁడు, కుమారస్వామి, కొండొక = కొంచెము. అన్న మున్నగునవి స్త్రీసమంబులగుటంజేసి బా. తత్స. ౫౭ సూత్రముచొప్పునఁ బ్రథమైకవచనలోపాదికమువచ్చి 'రము' మున్నగువానికివలెనే వానికి రూపసిద్ధి యగును. ఉదా:—అన్న-అన్నలు-అన్నను - అన్నలను. మొ. బియ్యము మున్నగునవి నపుంసకలింగసమము లగుటంజేసి 'బియ్య - నెయ్య' మున్నగుప్రాతిపదికములపై బా. తత్స. ౩౯ సూత్రముచొప్పున మువర్ణకమువచ్చి బియ్యము నెయ్యము మున్నగురూపములు సిద్ధించును. పిదప ముగాగమాదులువచ్చి బియ్యములు - బియ్యమును - బియ్యములను - బియ్యంబు - బియ్యమ్ము మున్నగురూపములును గల్గును. కవిశిరోభూషణానుకరణమునంజేసి సూరి తెలుఁగుశబ్దముచేతఁ బుంలింగసమముల సంగ్రహించరీతిని సూత్రరచనముఁ జేసె ననఁదగును. కొమరుఁడు-చందురుఁడు - పగతుఁడు-అల్లుఁడు మున్నగుశబ్దములు మహత్తులు పుల్లింగసమములు నగుటంజేసి బా. తత్స. ౨౧-౨౨ సూత్రముల చొప్పున "కొమర - చందుర - పగత - అల్ల" మున్నగు ప్రాతిపదికములకు "ఉత్వాదుజ్జులు" వచ్చి కొమరుఁడు, చందురుఁడు, పగతుఁడు, అల్లుఁడు మున్నగు రూపములు సిద్ధించును.

స్త్రీసమములు మహద్వాచకములును, నమహద్వాచకములును మహతీవాచకములును గానోపును. ఉదా:—అన్న - తండ్రి - గోడ - మేడ - అమ్మ - తల్లి - మొ.

ఇట్టి స్త్రీపున్నపుంసకసమముల విశేషణములవిషయ మీవలను విపులముగా విశదీకరింపఁబడెను. (౧౯౬ విషయము.) ఉదా:—అన్నసమర్థుఁడు - చందురుఁడు - మనోహరుఁడు - కయ్యము భయంకరము - తల్లిసదయ - సదయురాలు. మొ.

కొన్ని డుమంతములునైత మహద్వాచకములగుట కలదు. ఉదా:— సాలీఁడు = సాలెపురుగు, కొమ్ముకాఁడు = అడవిపంది, కత్తెరఁడు = ఒకజాతిగుఱ్ఱము, కైరఁడు = ఒకగుఱ్ఱముపేరు. ఒకఁడు = ఒకటి. మొ. సూరి స్త్రీలింగసమములను 'అ' కారాంతములనుమాత్రమె చూపెనుగాని 'ఇ'దంతాదులును గలవు. ఉదా:—తల్లి - చెలి - పిల్లి - నవలా - నేజా - లకోరీ - అవ్వ - తొవ్వ - చెలువ - చెలువ్వ -

పూవు - మనువు - చావు - కొడుకు - గొడుగు - పూ - వదినె - కన్నె - చిన్నె - వన్నె - రే - వ్రే - ముత్తో మొ. (విస్తర.)

అట్లె సూరి నపుంసకలింగసమములను సయితము 'అ'కారాంతములను మాత్రమె చూపినను దద్భిన్నము లనేకములు గలవు. ఉదా:—ఏతాము -

---

విస్తర. ౧౮౯ I విష:—ఇంకను వెనుక నుదాహరించినరీతిని చేసి - చేయక- చేయన్ - చేయుచున్ మున్నగు లాక్షణికావ్యయములును చేసిన - చేయుచున్న - చేయు - చేసెడు మొదలగుధాతుజవిశేషణములును (బాలవ్యాకరణపక్షమున నివి కళలు) తెల్ల - నల్ల మొదలగు గుణవిశేషణములును (బాలవ్యాకరణపక్షమున నివి కళలు) మున్నగునవిసయితము స్త్రీసమములని యంగీకరింపవలయును. అట్లంగీకరించి వానిపై సుప్రత్యయమును నిల్పి స్త్రీలింగప్రథమైకవచనలోపముచేసి (బా. తత్స. ౫౭ సూ.) పదత్వమును వానికి సంపాదింపవలయును. లేనిచో వానికి "అపదం న ప్రయుఞ్జీత" అనుచొప్పున వాక్యప్రయోగయోగ్యత కల్గనేరదు. అట్లు విభక్త్యంతములైనపిమ్మటనే వానికి "తిజ్మధ్య" సూత్రము చొప్పునఁ గళాద్రుతప్రకృతికత్వములను బరిశీలింపవలెను. (విస్త. I. ౪౨ I విష). పదత్వసిద్ధికై యంగీకరించిన యీసులోపమునుబట్టి యివి ప్రథమాంతములు గానఁ గళలని తలంపరాదు. ఇట్టి ప్రథమాంతత్వము కళాత్వసంపాదకము కానేరదు. (విస్తర. I. ౪౨ I విష. చూచునది.) 'చేసి - చేయక - చేయుచున్' మున్నగు లాక్షణికావ్యయములను స్త్రీలింగసమములనియు సుప్రత్యయాంతములనియుఁ జెప్పుట యెట్లని శంకింపరాదు. అవ్యయములపై విభక్తులను నిల్పుటయు "అవ్యయాదాప్సుపః" (౨-౪-౮౨) అనుచొప్పున విభక్తిలోపముచేయుటయు సంస్కృతమునందు సయితము ప్రసిద్ధమెకదా (సి. కౌ. ౪౫౨ సూ.) లేదా "నపదాన్త్యవ్యయే" త్యాది చింతామణిసూత్రముచొప్పుననైన వీనిమీఁదిసంస్కృతవిభక్తికి లోపముచేసి వీనికిఁ బదత్వమును సంపాదింపనగును (చూడు. ౧౧౨ విష. విస్తర. ౧౧౨ II విష. ౧౧౯ I విష.)

"చిట్టలు - విణ - ఆశ్చర్యము. అద్భుతము (చిట్ట. దే. వి. శ. ర; బ్రౌణ్య; చి - ని; = చిన్నయసూరినిఘంటువు. అముద్రితము)" (సూ. రా. ని.) పరిశీలింపఁగా "చిట్టలులు" అనుబహువచనరూపము లేమింజేసి "చిత్ర" శబ్దభవమగు 'చిట్ట' అనునది స్త్రీసమరూపమనియు నయ్యది నిత్యబహువచనాంతమనియు గ్రహించుటయుక్తమని తోఁచెడిని. ఉ. నీదు మహత్త్వ మెంతయుం । జిట్టలు గాదె (భార. ఆర. ౫ ఆ. ౨౨౩ ప.)

గోతాము - లాతాము - గారాము - మోము - గీము - గాము - అన్నెము - పున్నెము - నాడెము. మొ. వీనిని నపుంసకలింగసమములుగాఁ బరిగణించిన సామర్థ్యముచేతనే యదంతములు కాకున్నను బా. తత్స. ౩౯ సూత్రముచొప్పున వీనికి మువర్ణకాదులు వచ్చునని వ్యాఖ్యానము చేసికొనవలయును. ఉదా:—పున్నెము - పున్నెంబు - పున్నెమ్ము - పున్నెములు - పున్నెమ్ములు - పున్నెంబులు - పున్నెంపు గని. మొ. ఏతాము మున్నగుదీర్ఘపూర్వక మువర్ణకములకు "మ్ము - ంబు - ంపు" మున్నగురూపములు గలుగనేరవని ప్రయోగానుసారముగ వ్యాఖ్యచేసికొన వలయును. ఉదా:—ఏతాము - ఏతాముకొన. గీము - గీమువేల్పు. మొ. (౧౮౫ I విష.) గారాపుబిడ్డ మున్నగు నలంతిస్థలములలో బిందుపూర్వకముకాని పువర్ణప్రయోగము హితముగఁ దోఁచుచున్నది. సంస్కృతమునఁ బారిభాషికలింగ మునువలెనె తెల్గున నీస్త్రీసమత్వాదికమును మహాకవిప్రయోగములనుబట్టియె తెలిసికొనవయును.

పామ్బు - ఇరుమ్బు - ఉడుమ్బు - వేమ్బు మున్నగు తమిళశబ్దములతో, పాము - ఇనుము - ఉడుము - వేము - మున్నగు తెలుఁగుశబ్దములకుఁ గలసంబంధమును, 'అంబకము' అనుసంస్కృతశబ్దపువికృతి యనఁదగు "అమ్ము = బాణము" శబ్దమును, బరిశీలించునపుడు (౧౮౫ I విష) పాము మున్నగువాని తుదిది మువర్ణమాత్రమెకాని మువర్ణకము కాదనియు నట్టిపాము ప్రభృతులు స్త్రీసమములె యనియుఁ దోఁపకమానదు. అల్లెపుట్టుగు - పండుగు - నట్టుగుఁడు (నర్తకుఁడు) బందుగుఁడు (బాంధవుఁడు) మున్నగు శబ్దముల సంబంధమునుబట్టి పరిశీలించునపుడు పుట్టువు - పండువు - నట్టువు - బందువు - మున్నగువాని తుదివర్ణము పువర్ణమాత్రమె యనియు పువర్ణకము కాదనియు నట్టియాచ్ఛిక పువర్ణాంతములెల్ల స్త్రీసమములెయనియుఁ దోఁచకమానదు. "నాఽన్యేస్యుః" "అనుత్తాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః" అను చింతామణిసూత్రములు సయితము పైవిషయమును సిద్ధాంతీకరించుచున్నవి. (విస్తర. ౧౫౨ I విష. ౧౫౮ విష.) పువర్ణముచేరు 'పుట్టువు' మున్నగునవి నపుంసకలింగసమములను ఆ. భా. చరిత్ర (౧౬౮౫ పుట.) వ్రాఁత సరికాదు.

నన్నయా విశేషణానాం మహతో । డుజ్ఞి ఉభయథాపిచ । క్వచి
౧౯౦ విషయము. డుజ్మాత్రకే స్వార్థ।విశేషణమిహోచ్యతే. (వికృ. అజం. ౩౨ కారి. అహో. ౩౦౭ పు.)

కల్పతరు. ౧౯౦ విష:—మహతః = మహద్వాచకముయొక్క, విశేషణానామ్ = విశేషణములగు సాంస్కృతికాచ్ఛికవిశేష్యనిఘ్నశబ్దములకు, డుజ్ఞి స్యా

తామ్ = డుజ్ వర్ణకమును దస్తూలకన్యాగమాదులును నగును. అట్టి విశేష్యనిఘ్నములకు, ఉభయథాపిచ = డుమ్మంతత్వ మువర్ణకాంతత్వములు రెండును మహత్త్వామహత్త్వములనుబట్టికల్గును. మహతీవాచకవిశేష్యనిఘ్నవిశేషణములవిషయము నన్నయచేఁ జెప్పఁబడెను గాన (౧౮౬ విష.) మిగిలిన మహదమహత్తులవిషయము నిట నథర్వణుఁడు వివరించెను. క్వచిత్ = కొన్నియెడల, స్వార్థవిశేషణమ్ = మహదర్థకాదులవిశేషణమగుశబ్దము, డుజ్ మాత్రకే = డుజ్వర్ణకాంతత్వమాత్రమునందె, ఇహ = ఈయాచ్ఛికప్రకరణమున, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. బల్లిదాదులలోఁ గొన్నింటికి మువర్ణకాంతరూపములు లేవని తాత్పర్యము.

బల్లిదాదు లాచ్ఛికములగు విశేష్యనిఘ్నశబ్దములు. బల్లిదుఁడు = బలిష్ఠుఁడు, అక్కజుఁడు = అధికుఁడు, కావలుఁడు = కావరుఁడు = మదముగలవాఁడు = గర్వి, బెట్టిదుఁడు = ఉద్ధతుఁడు, మిసిమింతుఁడు = అలసినవాఁడు, మొక్కలుఁడు = శూరుఁడు, ప్రల్లదుఁడు = దుష్టుఁడు, కుచ్చితుఁడు = కుత్సితుఁడు, నెయ్యుఁడు = స్నేహితుఁడు, ఒడయుఁడు = అధికారి. ఇట్టివి మహత్తులకు విశేషణములగునపుడు పుంలింగసమములు మహత్తులు నై యుత్వడుజ్లులనందును. ఉదా:—రాముఁడు బల్లిదుఁడు - అన్న బల్లిదుఁడు. మొ.

ఇవి యమహత్తులకు విశేషణములగునపు డమహత్తులును నపుంసకలింగసమములును నగును. ఉదా:—ఈవంశము బల్లిదము. ఆవంగడము బల్లిదము. నన్నయ వికృతౌచ స్త్రీలింగా ఇత్యాదిచింతామణికారికను మహతీవాచకవిశేషణములవిషయమున నుపదేశించెను. (౧౮౬ విష.) కాన దానిచొప్పున మహతీవాచకవిశేషణము లాచ్ఛికములగునపు డాలుశబ్దముతో సమసించి రూపసిద్ధినందును. సంస్కృత విశేషణము స్త్రీలింగమే యగును. ఉదా:—ఆమె బల్లిదురాలు, ఈమె సమర్థ. మొ. తత్సమములందే యుత్వమువచ్చునని నన్నయాథర్వణులు వచింపలేదుగాన నుత్వము నిర్బాధము. (౯౩ విష.)

పయిశబ్దములలోఁ గొన్నిటికి నపుంసకలింగసమరూపము లుండనేరవని "క్వచిడ్డుజ్మాత్రకే,........" అనువచనమువలన విశదమగుచున్నది. ఉదా:—మిసిమింతుఁడు - మిసిమింతురాలు - ఒడయుఁడు - ఒడయురాలు. 'మిసిమింతమైనపతి' అను రీతి ప్రయోగములు లేవు. అన్న బల్లిదుఁడు - ఆమె బల్లిదురాలు - అది బల్లిదము. మొ.

బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు. 3.

బాలవ్యా. మహత్త్వంబున వీని కుత్వడుజాదులు నమహత్త్వంబున
౧౯౦ I విషయము. మువర్ణకాదులు, స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ
సమాసంబునుం గలుగునని యెఱుంగునది. బల్లిదుఁడు-

బల్లిదము - బల్లిదురాలు - బల్లిద - అక్కజ - కావల -
బెట్టిద-మిసిమింత-యొక్కల-ఇత్యాదులు బల్లిదాదులు.

సంజీవని. ౧౯౦ I విష:—సూరి నన్నయాథర్వణులపద్ధతిని గ్రహింపఁజాలక విశేషణముల పుంస్త్వాదికమును బుంలింగసమత్వాదికమును నుపదేశింపఁడయ్యె. అట్లగుటంజేసి బల్లిదాద్యాచ్ఛికవిశేషణముల కుత్వడుజాదులు మువర్ణకాదులు సిద్ధించుటకయి వానికి సంస్కృతతుల్యత్వ మతిదేశించికొనెను. సంస్కృతత్వాతిదేశంబున సంస్కృతవిశేష్యనిఘ్నములకువలెనే వీనికిని బున్నపుంసకత్వములు సిద్ధించునని వివరించెను. కాన రాముఁడు బల్లిదుఁడు. ఆవంశము బల్లిదము. మున్నగురూపములు సిద్ధించును. స్త్రీత్వమున 'సీత బల్లిద'మున్నగు ననిష్టరూపములు సిద్ధింపకుండ "స్త్రీత్వంబునం దాలుశబ్దంబుతో సమాసంబునుం గలుగు"నని వివరించెను. సంస్కృతత్వాతిదేశంబుననె బా. సంధి. 3౧ సూత్రముచొప్పున నుత్వము సిద్ధించునను తలంపున 'బల్లిదురాలు' అని యుదాహరించెను.

"తండ్రి సమర్థుఁడు, తండ్రి బల్లిదుఁడు, ఆమె సమర్థ"మున్నగుచోటులందుఁ బుంస్త్వాదికము సాధించుగతి బాలవ్యాకరణపద్ధతిలో లేమింజేసి యవి బాలవ్యాకరణ సాధ్యములు కాఁజాలవు. ప్రత్యేకవిధి లేనపుడు బాల. ఆచ్ఛి. ౨ సూత్రము చొప్పున నిట్టి విశేషణశబ్దములకు స్త్రీపున్నపుంసకసమత్వములు సిద్ధింపవని సూరియే ప్రకృతసూత్రపు సంస్కృతత్వాతిదేశఫలవివరణమున నంగీకరించియున్నాడు. ప్రయోగములు:—మ......బల్లిదుఁ డాయింద్రుని పారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చి (ద్రోణ. ౧ ఆ. ౯౭ ప.) చ. పెనంగితి రేమిసేయుదురు బెట్టిదుఁడై విధి తప్పఁజూచినన్. (శల్య. ౨ ఆ. ౪౯) సీ. చంపె నాగాయుతసత్త్వు జరాసంధు, నెక్కటి యోర్చిన యక్కజుండు. (ఆర. ౧ ఆ. ౧౦౨) సీ. ఎక్కి బ్రాహ్మణులకు నక్కజం బగు నవ, మానమునేసిన దాన నాకు। (ఆర. ౪ ఆ. ౧౧౯) క......... మిసి । మింతుఁడుగా కతఁడు ప్రియకు మెచ్చు దలిర్పన్. (హరి. ఉ. భా. ౭ ఆ. శ. ర.) గీ. లోలలోచన మిసిమింతురాలుగాక।వహ్నికీలలలో నిట్లు వన్నె చెడక. (హరిశ్చం. 3 ఆ. శ. ర.) ఉ. ప్రల్లదుఁడైన యొక్కకులపాంసను చేసినదాన (ఆది. ౧ ఆ. ౧౩౬)

క్వచి దమహతో౽పి డుజ్ స్యా। దేకాదే రమహా
తాంచ డావున్న। (ఆం. చిం. అజం. ౧3 కారి.
నన్నయాథ. అహో. 3౦౭ పు.)

౯౧ విషయము. సబిన్దుకస్య డోః స్థానే। నిర్నిత్య ముపలిక్ష్యతే. (వికృ. అజం. ౧౧౦ కారి. అహో. 3౭౬.)

కల్పతరు. ౧౯౧ విష:—వీనికి వ్యాఖ్య చేయఁబడెను. (౧౩౨ విష.). అహోబలపతి పాక్షికనాగమమును విధించు విశేషణానాం మహత ఇత్యాదికారికను (౧౯౦ వి.) నిత్యనాగమము కావలసిన యేకాదులవిషయమున నుపయోగించుటయు, నిత్యనాగమమును విధించు సబిన్దుకస్యేత్యాదిప్రకృతకారిక నిట నుపయోగించుకొనకుండుటయు, "క్వచి ద్డుజ్ఞాత్రకే స్వార్థేత్యాది"డుజ్రూపనిత్యతగల మినిమింతాదులవిషయమున నుపయోగింపక (౧౯౦ విష.) "ఒక్కఁడు = ఒక్కటి" అనురూపద్వయముగల యేకశబ్దమాత్రవిషయమున వాడికొనుటయు నవిమర్శనకృతములు. (అహో. ౩౦౭ పు.)

"మగఁడు - అతఁడు - ఇతఁడు - ఎవ్వఁడు - గొల్లఁడు - మనుమఁడు - తేఁడు - అబ్బఁడు - అప్పఁడు - మిండఁడు - గండఁడు - ఇత్యాదీనాం, గంగఁడు - మంగఁడు - సింగఁడు ఇత్యాది జననామ్నాంచ ఏకాదిత్వమేవ. ఉత్వనిషేధార్థం బాప - హనుమ - రాయాదిశబ్దానామప్యేకాదిత్వమ్" (అహో. ౩౦౭-౩౦౮ పు.) అని యేకాదిగణము నహోబలపతి వివరించెను. వీనిలోని 'అతఁడు - ఇతఁడు - ఎవ్వఁడు' అనువానిని "భవేత్తదాదిశబ్దేభ్యో - డుజాదిస్తుభవేన్నచోత్" అను కారికచొప్పునఁ దదాదులలోఁ జేర్చుట యుక్తము. అహోబలపతి "ఉత్వనిషేధార్థం బాపహనుమరాయాదిశబ్దానా మప్యేకాదిత్వమ్" (అహో. ౩౦౮ పు.) అని వ్రాసెను. కాని వీనినేకాక యుత్వనిషేధప్రసక్తిలేని "ఈ.కా" ప్రత్యయాంతాదిశబ్దముల నెల్ల నాగమనిత్యతకై యేకాదులలోఁ జరింపకతీరదు. ఏకాదులు పుంలింగసమములు తఱుచుగా మహద్వాచకములు నగుటచే వానికి జెముఁడు - కొమరుఁడు మున్నగువానికివలెనె యుత్వడుజ్లు లెట్లును బ్రాప్తించును. అట్లు ప్రాప్తించు నుత్వమును వారించుటయు నాగమనిత్యతను విధించుటయుఁ నమహత్తులకు డుజ్లును విధించుటయుఁ బ్రకృతసూత్రములకుఁ బ్రయోజనములు. స్పష్టప్రతిపత్తికయి "అమహతాంచ డావున్న" అని చెప్పఁబడెనేకాని యమహత్తుల కుత్వప్రాప్తియే లేదు. డుజ్పరకత్వమున నుత్వములేని యాచ్ఛికశబ్దముల కెల్ల నాగమము నిత్యమగుటచేతనే త్రే-ప్రే ప్రభృతిశబ్దములును 'ఈ - ఆ - కా' ప్రత్యయాంతాదులును నేకాదులలోఁ జేర్పఁబడుచున్నవి.

మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్జగు;
బాలవ్యాకరణ సుత్వంబుగాదు. ౪.

వివరణము మగఁడు - మనుమఁడు - కయిరఁడు - కత్తెఁడు.

౧౯౧ I విషయము. మగ - మనుమ - రాయ - పాప - ప్రే - త్రే - ఈ - కా - ప్ర[illegible] బులు - ఇత్యాదులు మగా

దులు. కయిర - కత్తళి - జన్న - నీల ఇత్యాదులు కయి
రాదులు.

సంజీవని. ౧౯౧ I విష:—అర్థ:—మగఁడు = భర్త - పూరుఁడు, మను మఁడు = పౌత్త్రుఁడు - దౌహిత్త్రుఁడు, కయిరఁడు = ఒకగుఱ్ఱముపేరు. కత్తళఁడు = తెల్లనిగౌరిజయుఁ దోఁకయు దానివెండ్రుకలును గలనల్లగుఱ్ఱము (శ.ర). రాయఁడు= రాజు. (విస్తర. I) పాపఁడు = బాలుఁడు, ప్రేఁడు = గొల్లవాఁడు, తేఁడు = రాజు, విలుకాఁడు కా ప్రత్యయాంతము, కొండీఁడు ఈ ప్రత్యయాంతము. ఇత్యాదులనుటచే మగాదిక మాకృతిగణమని గ్రహింపనగును. ఆదిశబ్దముచే వగలాఁడు ('ఆ' ప్రత్యయాంతము. బా. తద్ధి. ౧౧ మొ. ౧౬ వ. సూ.) జన్నఁడు = ఒకగుఱ్ఱముపేరు. నీలఁడు = ఒకనీలాశ్వము. ఇత్యాదులు కయిరాదు లనుటచే కయిరాదికము నాకృతి గణమె యననగును. ఆదిశబ్దముచే "పులియఁడు - సురియఁడు - మెరియఁడు" మొదలగువాని నెన్నునది.

---

విస్తర. I. ౧౯౧ I విష:—"ఒకానొకఁడు........రాయున్ అని ప్రయోగించె. అయ్యది ప్రామాదికంబు. ఈశబ్దంబునకు రామశబ్దంబునకుంబోలె సంబుద్ధియందు డుజ్వర్ణకలోపముమాత్రము మహాకవిప్రయోగంబులఁ గానంబడియెడి... (బా. గు. ప్ర. ఆచ్ఛి. ౪ సూ. వ్యా.). ఈవ్రాఁత సరికాదు. 'రాయున్' అనునది ప్రామాదికమైనం గావచ్చునుగాని సంబుద్ధియందు వ్యస్తతలో "రాయ" అనురీతిని డుజ్వర్ణకలోపము సమ్మతముకాదు. అట్టి కవిప్రయోగమును లేదు. సీ. తొలుదొల్త.........గీ.........ఖేలదుగ్రప్రతాపాగ్నికృష్ణరాయ. (ఆము. పీఠిక. ౧ ఆ. ౩౬) సీ. సనకాది.........."గీ.........పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ" (ఆముక్త. పీఠి. ౧ ఆ ౪౧ ప.) అని యిట్లు సమాసమునందట్టి ప్రయోగము కన్పట్టుచున్నది. బా. తత్స. ౨౪ సూత్రముచొప్పున 'రాయఁడు' అనుదాని డుజ్వర్ణకము సంబుద్ధిలో లోపింపనేరదు. కృతోత్కసంస్కృతనామంబు సంబుద్ధి డుజ్జునకే లోపము సమ్మతమయియున్నది. పైయాముక్తమాల్యద ప్రయోగమున 'రాయ' శబ్దము సంస్కృతముగ ననుకరింపఁబడి సిద్ధసమాసగతమయ్యెననియు నక్కారణమున నచట 'కృష్ణరాయుఁడు' అనుకృతోత్కసంస్కృతనామమె కవిచే వివక్షితమయ్యెననియు నట్లగుటంజేసి 'కృష్ణరాయ' అనుసంబోధనము సాధువయ్యెననియు గ్రహింపవలయును. అంతమాత్రమున "రాయా" అనువ్యస్తసంబోధనరూపము సాధువని భ్రమింపరాదు. (అహో. ౪౧౨ పు.) ప్రౌఢవ్యాకర్త యిట్లు వ్రాయక "కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్లయగు" (ప్రౌఢ. సమా. ౬ సూ.) అని

చింతామణిలోని యేకాదులె బాలవ్యాకరణములోని మగాదులని యెఱుంగునది. మగాదులు మహాత్ములును బా. ఆచ్ఛి. ౨ సూత్రముచొప్పునఁ బుంలింగసమములును నగుటచే వాని కుత్వదుజ్ఞులు యథాయోగముగా సంభవించుచుండ నుత్వమును వారించుట మగాదిగణప్రసంగమునకు ఫలము (విస్తర.) II గోపత్వ - నాయ

---

సిద్ధసమాసవద్భావము నంగీకరించి సాధించికొనెను. ఆముక్తమాల్యదలో నిట్లు 'కృష్ణరాయఁడు' అని ప్రయోగింపఁబడినను గవిపితామహాదులు "కృష్ణరాయఁడు" అనురూపమునె ప్రయోగించియున్నారు. మ.........శ్రీకృష్ణరా । యల బాహామృగనాభిసంకుమదసాంద్రాశ్రీ లేపపంకంబునన్ (మనుచ. ౧ ఆ. (పీఠిక.) 3౫ ప.) మ... కృష్ణరా । యనికిన్ వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై (పారి. ౧ ఆ. 3 ప.) గీ.........అచ్యు । తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. (మను. చ. ౧ ఆ. 3౧ ప.). గీ. అతఁడు దీవించి తగను రాయలకు నిమ్మ।హాత్మురాలిని (కృష్ణ. ౪ ఆ.) అని యిట్లు వ్యస్తతలో "రాయఁడు" అనురూపమె వెలయుచున్నది. "ఒడయుఁడు.........ఇట్లె రాయుఁడు - నాయుఁడు" (ఆం. భా. అ. శబ్ద. ౫సూ.) అని యుదాహరించుట కవిప్రయోగసమ్మతముగఁ గన్పట్టదు. ఒడయశబ్దము వ్యస్తతయందును "ఒడయఁడు - ఒడయుఁడు" అనురూపద్వయముతోఁ బ్రయోగదృష్టమగుచున్నది. కాన నుత్వఘటితరూపము బల్లిదాదులలోఁ జేర్చియు నుత్వములేని రూపము మగాదులలోఁ జేర్చియు సాధించికొనవలయును. ఉ. అత్తఱి జోగివేల్పు టొడయండెద నాతని మెచ్చి (అచ్చ. రా. బాల. ౧౨౬, సూ. రా. ని.) గీ. యువతిమండలముల కొడయుఁడవుగమ్ము (జై. భా. ౫ ఆ. ౧౦౭) (శ. ర).

విస్తర. II ౧౯౧ I విషః—"మగాదిగణమున దుజ్విధానమె చేయవలసి వచ్చెను.........౨ సూత్రము.........ఆచ్ఛికశబ్దసామాన్యస్వరూపప్రకాశనపరమేకాని శబ్దసాధనవిషయప్రధానముగామిని యా (?) చ్ఛికశబ్దసాధనమునకయి యిట్టి విశేషశాస్త్రము లీపరిచ్ఛేదమునఁ బ్రసక్తములయ్యె" (బా. సా. వే. అచ్ఛి. ౪ సూ. వ్యా.) అనువేటికావ్యాఖ్య సరికాదు. బా. ఆచ్ఛి. ౨ సూత్రమున వివరింపఁబడిన స్త్రీపున్నపుంసకసమత్వాతిదేశము శబ్దసాధనప్రక్రియాపరము కానపుడు బల్లిదాదిసూత్రమునకును మగాదిసూత్రమునకును విషయములు కాని అయ్య - అన్న - గోడ - మేడ - చందురుఁడు - కొమరుఁడు మున్నగు ననంతాచ్ఛికశబ్దసాధనమునకు గతియేమో తెలియకున్నది. స్త్రీసమత్వాతిదేశము లేనపుడు అయ్య - అన్న - గోడ - మున్నగువానికి స్త్రీలింగప్రథమైకవచనలోప మెట్లు ? పుంలింగసమత్వాతిదేశము లేనపుడు కొమరుఁడు మున్నగువాని కుత్వదుజ్ఞు లెట్లు గల్గును ?

కత్వము లర్థము లగుటంజేసి డుజ్ వర్ణకాంతములె యగునని స్పష్టపఱుచుటకు ప్రే-తే శబ్దములను, నమహత్తులగునపుడును 'ఈ-కా' ప్రత్యయాంతములకు డుజ్జువచ్చుటకు వానిని, మగాదులలోఁ జేర్చుటకు ఫలము. కైరాదుల కుత్వప్రాప్తియే లేమింజేసి వానిప్రసంగము డుజ్విధానమాత్రఫలకము. మగాదులలో సాలీఁడు - కొమ్ముకాఁడు మున్నగునవి యమహత్తులు, కాన 'మహత్తులగు' అనుమగాదివిశేషణమును ఛత్త్రిన్యాయమున యథాసంభవముగా నన్వయించుకొనవలయును.

ప్రయోగములు:—క.........ఇట్టి మ|గండుగలఁడె పిదప నెట్లు గయ్యము సెల్లెన్ (కర్ణ. ౨ ఆ. ౨౧౫) క.........|అని యప్మాలఁడు తొలుబా|మున...... (అను. ౪ ఆ. ౪౭ ప.) ఉ.........నన్|మీాఆఁగ బానసీని నొకనిం బురిఁగాననియట్లుగాఁగ...(విరా. ౧ ఆ. ౭౭) చ...జా|ణని మగనిం గవుంగిట నన్నారతమున్ (ఉ. హరి. ౫ ఆ. ౭౫ ప.) ఉ. ప్రేనితనూజుఁ డొక్క డతివీర్యసమగ్రుఁడు...... (హరి. ఉ. భా. 3 ఆ. ౯౪) క. హనుమునివాలము.........(భాస్కర. సుందర. ౪౫౬ ప.) సీ. వరరథ మొక్కండు వారణ మొక్కండు తురగముల్ (ఆది. ౧ ఆ. ౮౦ ప.) చ. పులియఁడు బూచిగాఁడు.........చిటిలింగఁడు సాల్వఁడు (మనుచ. ౪ ఆ. 3౨ ప. ఇవి వేఁటకుక్కలపేరులు) క. ఒనరించిన నీలని నడ | గని బొల్లనిఁ గత్తలానిఁ, గైరని, సారం| గని, జారని, జన్నని, నిమ|వన్ని, మొదలుగఁ దెచ్చి నిల్తిపె వాహకుఁ డెదురన్. (సింహాసనద్వాత్రింశిక. 3 ఆ. ౧౪౧. సూ. రా. ని. నీలఁడు శబ్దమునొద్ద.)

నిత్యం దారాదేశ్చ | స్యా ల్లో గ్లలయో రురొాచ తత్ర స్తః|(అం. చిం. అజం. ౧౮ కారి. అహో. 3౭౮ పు.) ఉతో లోపశ్చ లులయో| స్తథా పుంసి రురౌ స్మృతౌ|(విశ్వ. అజం. ౫౨ కారి. అహో. 3౭౯.)

నన్నయా ధర్వణీయము. ౯౨ విషయము.

ఏకత్వేచ భవే ద్వారు | స్తథా లౌ చభ వే త్క్వచిత్ (విశ్వ. అజం. 3౫ కా. అహో. 3౦౮.) తయో శ్ళసాదౌ రేమాత్ర | ఉదతోః ప్రాయశో౽త్ర ఇత్. (విశ్వ. అజం. 3౬ కా. అహో. 3౧౦ పు.)

కల్పతరు. ౯౨ విషః—నిత్యమిత్యాదిః-"సలలో ర్బిన్దుయుతో డుఃర్వా లులయోః" అనుపూర్వకారికనుండి "బిన్దుయుతో డుః, లులయోః" అనునవి యీసూత్రములోని చకారముచే నాకృష్టము లగుచున్నవి. లులయోః = బహువచన లులలుపరమగుచుండఁగా- బిన్దుయుతో డుః = పూర్ణబిందుపూర్వకడువర్ణము, దారాదేః

ఆలు ప్రభృతిశబ్దముల, లోః = తుది లువర్ణమునకును, నిత్యంస్యాత్ = నిత్యముగా నాదేశమగును. నిత్యమ్మనుటచేత సలలోరిత్యాదిసూత్రములోని వాశబ్ద మాకృష్టము కాదయ్యెను. తత్ర = ఆస్థలమునందలి, లులయోః = బహువచన లులలకు, రరౌచ స్తః = వరుసగా రరలును నిత్యముగా నాదేశమగును. ఉదా:—ఆలు+లు= ఆ+ండు+లు = ఆండు+రు = ఆందురు. సలలోరిత్యాదిసూత్రములోని 'ఉల్లుగపి' అనునదియు వాకృష్టమై యట్టియుల్లోపము నైతము సూత్రములోని నిత్యశబ్దముచే నిత్యమగుచు "ఆంద్రు" అనురూపముమాత్రమె సిద్ధించు ననుభీతిచే నథర్వణుఁడు 'ఉతోలోపశ్చ'అని సూత్రించి యుల్లోపపాక్షికతను వచించుచున్నాఁడు. ఉతః=అట్టి బిందుపూర్వక డువర్ణముయొక్క, 'ఉకారమునకు' లోపశ్చ= లోపమునయితము సంభవించును. అనఁగా 'చ' కారముచే లోపముపాక్షికముగ నగునని తాత్పర్యము. ఉదా:—ఆందురు = ఆంద్రు. అహోబలపండితుఁడు పైయథర్వసూత్రమును బయి రీతిని సమన్వయించికొనక ప్రకృతసూత్రములోని నిత్యశబ్దముచే నుల్లోపమునయి తము నిత్యమె యని వ్యాఖ్యచేసి "ఆందురు" అనురూపమును సాధించికొనలేదు. "దారాదేశ్చ నిత్యం బిన్దుయుతోడు, దుల్లోపశ్చ నిత్యం స్యాత్ లులయోః పరతః, తత్ర దారాదౌ స్థితయోః లులయోః క్రమాత్ రరౌ ఇత్యేతావాదేశౌచ నిత్యం స్తః. ఆల్వాదయో దారాదిగణః. ఆంద్రు - జవరాంద్రు - చెల్లెంద్రు - కోడండ్రు - ఇత్యాది" (అహో. 3౨౭ పు.) ఇది సరికాదు. ఈ సందర్భమున నడుకుచున్న "ఉతోలోపశ్చ" అనుసూత్రము నిచట బైరీతిని సుసంగతముగా నడికికొనక యుపేక్షించునపుడు "ఉతోలోశ్చ లులయో। స్తథా పుంసి రరౌస్మృతౌ" అనుదానివలన లభించు పగతాదుల రత్వవిధానము సిద్ధింపకపోవలసి వచ్చును. (అహోబలపతి యీకారికకు వివరణమునే చేయలేదు. 3౨౯ పు.)ఆందురు మున్నగు కవిప్రయోగములును సంగ్రహింపఁబడకపోవలసివచ్చును. (సూరిన లె బిందుపూర్వకవ్యంజనడకార విధానమును జేయక బిందుపూర్వక డువర్ణాగమము చేసి యుల్లోపవిధానముచేసిన ప్రక్రియాగౌరవమే 'ఆందురు' మున్నగుచోట్లు లందలి యథర్వణుని యుల్లోపపాక్షికతాభిప్రాయమును వక్కాణించుచున్నది.) సలలోరిత్యాదిసూత్రము మొదలుగ "ఔపవిభక్తికలీనామ్ము"ను సూత్రము వఱకుఁ జింతామణి తలంచిన యుల్లోపపాక్షికతాప్రక్రమము భగ్నముకావలసి వచ్చును. చింతామణిలో నీసందర్భమందంతటను నుల్లోపపాక్షికతయే వచింపఁబడినది. ఈసందర్భమున నడికిన యథర్వణకారికలందును నుల్లోపపాక్షికతయే యంగీకరింపఁబడెను. కేషాంచిద్ర్వ్యస్తశబ్దానామిత్యాదిసూత్రమున "తథా డుజ్" అనుచింతా

మణ్యుక్తపాక్షికవిధియే యనువదింపఁబడెను. (౧౯౩ విష.) ఇట్టి యుల్లోపపాక్షిక తయె యన్నిటను మహాకవి ప్రయోగసమ్మతముగ నున్నది. సీ. ఆంధ్రను బిడ్డలన్... (ఉద్యో. ౨ ఆ. ౧౨౭ ప.) (౧౯౮-౨౦౪ విషయములు) క. సుందరి నాకోడండురు। యం దభ్యర్హితవు (సభా. ౨ ఆ. ౨౫౭) ఉ. ఏ। కాంతమునందు నున్న జవరాంధ్ర నెపంబిడి (మనుచ. ౨ ఆ. ౪౧). లులయోరిత్యాది:—పుంసి=పుంలింగసమములగు కొన్ని మహద్వాచకములందున్న, లులయోః = బహువచనలులలచోట, రురౌ = రురలు, తథా = అట్లె, 'నిత్యందారాదేశ్చ' అనుచొప్పున నాల్వాదులకువలెనె నిత్యముగా, మతౌ = సమ్మతములగును. మహతీవాచకములగు నాల్వాదులందే కాక మహద్వాచకములందును గొన్నిట బహువచన లులలచోట రురలు నిత్యముగా నాదేశము లగునని తాత్పర్యము. ఉదా:—పగత+లు=పగతురు. ఈపగతాదులు మహత్తులును బుంలింగసమములును నగుటచే వీనికి నుత్వాప్రజ్ఞులు వచ్చునని యెఱుంగునది, ఉదా:- పగతుఁడు - పగతురు, మార్తుఁడు - మార్తురు, నెయ్యుఁడు-నెయ్యురు, బలియుఁడు-బలియురు, ఎల్లశబ్దమునకు మహత్త్వమున నేకవచనము లేమింజేసి 'ఎల్లరు' అను బహువచనరూపముమాత్రమె లభించును. అచ్ఛికశబ్దముల 'లుల'లచోట 'రుర' లాదేశమగుట కిదియే యంతటను సామాన్యశాస్త్రమైయున్నది. మఱికొన్ని యథర్వణవచనములలోఁ బునరుక్తము లగుచున్నను నవియెల్ల దీని కనువాదములె యని గ్రహింపవలయును. ఇట్టి సామాన్యశాస్త్రమున కహోబలపతి వివరణమే చేయలేదు. (అహో. ౩౨౯ పు.) ఇట్లు రురలాదేశమగుశబ్దములలోఁ గొన్నిటికి బిందుపూర్వక డువర్ణాగమమును, వారిన్, వీరిన్ మున్నగుచోటులం దిత్వమును ముందు సూత్రింపఁబడును. వారు - వాండ్రు - వారిన్ - వాండ్రన్. మొ.

ఏకత్వేచేత్యాది—ఏకత్వేచ = ఏకవచనమునందును, వా = వికల్పముగా, రుః = రువర్ణాగమము (కూఁతుశబ్దమునందని వ్యాఖ్య చేయనగును.) భవేత్ = అగును. లౌ = బహువచన లుప్రత్యయము పరమగునపుడు, తథా = ఆప్రకారమె, క్వచిత్ = క్వాచిత్కముగా, భవేచ్చ అగుటయుఁ గలదు. కాకపోవుటయె ప్రచుర ప్రయోగసిద్ధమని యర్థము. ఉదా:—కూఁతు = కూఁతురు, కూఁతులు = కూఁతురులు. మొ. తయోశ్శసాదావిత్యాది—అత్ర = ఈసందర్భమున, ఏకత్వే = ఏకవచనమునందు (పూర్వసూత్రమునుండి యనువృత్తి) తయోః = ఆరెండిటితుదియందు నున్నట్టియు (మీఁదఁ జెప్పఁబడిన 'ఆలు' ప్రభృతులును, కూఁతురుశబ్దమును 'తయోః' అనుదానిచేఁ బరామర్శింపఁబడుచున్నవి.) అనఁగా నాలుప్రభృతులతుదిని 'కూఁతురు' శబ్దము తుదిని నున్నట్టియు నని యర్థము. శసాదౌ, రే, మాత్రేఽద్వితీ

యాదివిభక్తులబహువచనమునందలి 'ర' వర్ణముమీఁద నున్నట్టియు, ('నేమాత్రే' అనుపాఠము ప్రామాదికము.) ఉవతోః = ఉకారమునకును 'అ' కారమునకును (క్రమాన్వయము) ప్రాయశః = తఱుచుగా, ఇత్ హ్రస్వేకార మాదేశమగును. అనఁగా నేకవచనమున 'కూఁతురు' శబ్దము తుదినున్న 'ఉ'కారమునకును 'ఆలు' ప్రభృతుల తుదినున్న 'ఉకార' మునకును బ్రాయికముగా 'ఇ' కార మాదేశమగు ననియు, ద్వితీయాదుల బహువచనమునందలి లవర్ణమున కాదేశముగావచ్చు (లులయో స్తథా పుంసిరురౌస్మృతౌ' అను (౧౯౨ విష.) చొప్పునవచ్చు) రవర్ణముమీఁది 'అ'వర్ణమునకును (తదాదులందనిగ్రహింపవలెను. వారిన్. మొ.) ఇవర్ణ మాదేశమగు ననియుఁ దాత్పర్యము. సంస్కృతమున వాక్యసంధివైవక్షికముగాన "అత్ర+ఇత్" అనుచో గుణసంధి లేదయ్యెను. ఉదా:—కూఁతురిన్ - కూఁతురిచేన్, ఆలిన్; ఆలిచేన్ - చెల్లెలిన్ - చెల్లెలిచేన్, వారిన్ - వారిచేన్ - ఇట్టివీరిన్ - వేరిన్ - ఏవారిన్. మొ. వారుశబ్దపరిణామమె యనఁదగు గారుశబ్దమునందును నీవిధి వర్తిల్లును. ఉ. అత్తగారిన్ - మామగారిచేతన్. మొ. ప్రాయోగ్రహణమున ఇరువురన్ - మూవురన్ - పలువురన్ - మున్నగుచోటులందు వారు శబ్దము వురురూపమునందు నవు డిత్వము లేదని వ్యాఖ్య చేయనగును. 'రేమాత్రే' అనుటచేత శకటాదేశస్థలములలో నిత్వమువచ్చుట నన్నయాథర్వణసమ్మతము కాదని యెన్ననగును. ఉదా:— అందఱన్ - ఇందఱన్ - ఎందఱన్ - కొందఱన్ - ఇద్దఱన్.

బాలవ్యా. పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు. ౫.

౧౯౨ I విష. పగతురు - అల్లురు - నెయ్యురు - మార్తురు.

సంజీవని. ౧౯౨ I విష:—అర్థములు:—పగతురు = శత్రువులు, అల్లురు = జామాతలు, నెయ్యురు = మిత్రులు, బలియురు = బలశాలులు - మార్తురు = శత్రువులు (మాఱుతుఁడు = మార్తుఁడు). పగతాదిశబ్దములు మహత్తులు పుంలింగసమములునుగాన వాని కుత్వడుజ్ఞులువచ్చును. పగతులు మున్నగు ననిష్టరూపములు సిద్ధింపకుండఁ బ్రకృతసూత్రమున నిత్యరత్వము విధింపఁబడెను. పగతుఁడు - పగతురు, పగతునిన్ - పగతున్, పగతురన్. మొ. 'నెయ్యుఁడు - నెయ్యురాలు - నెయ్యము' అను త్రివిధరూపములు నుండుటచేత నెయ్యశబ్దము బల్లిదాదులలోని దనఁదగును. గుప్తార్థప్రకాశికాకర్త 'మల్లుఁడు - మల్లులు' అనురూపద్వయముగలదని వ్రాసెను. మల్లశబ్దము తత్సమమగుటంజేసి యది పగతాదులలోని దనుట సరికాదు. అద్దాని విమర్శము బా. తత్స. ౩౮ సూత్రమునొద్ద (౧౪౪ విష.) వ్రాయఁబడెను. ఇందు రేఫాదేశము నిత్యముగా విధింపఁబడుటచే 'అల్లుండ్రు' మున్నగునవి సూరి

కిని సమ్మతములు కావనఁదగును. అనుశాసనమున నీక్రింది ప్రయోగములు చూపఁబడినవి. గీ. దత్తు నల్లుండ్ర మెడను సూత్రములు కట్టి (కాశీ) నడయాస జోకొట్టి ననకంపు టల్లుండ్ర (కవిక) కదలి రత్యుత్కంఠ నల్లుండ్రు సోదరుల్. (చంద్రభా.) (ఆం. భా. అ. శబ్ద. ౭౮ సూ.) ఈమూఁడు ప్రయోగములందును "అల్లుండ్రు" అనుచోట "అల్లురు" అని నిల్పినను క్షతిలేమింజేసి యివి సందేహనిర్ణాయక ప్రయోగములు కాఁజాలవు. పగతాదుల రత్వమునకుఁ బ్రయోగములు:—గీ. బహువిధంబులఁ బగతుర బరవసమున (విరా. ౪ ఆ. ౬౨). క. కాల్వురు మ్రగ్గఁజేయుచును మ్రగ్గిరి (ద్రోణ. ౧ ఆ. ౨౭౨ ప.) (కాల్వురు నిత్యబహువచనాంతము. పదాతిసైన్యము). క. నరుఁ డనుఁగుబంటు.........సూతపుత్త్రుఁ డొకఁడు మాఱ్తుర మార్కొని యొడు,..(ద్రోణ. ౫ ఆ. ౨౬ ప.) క.........నెయ్యురు దాను నగ్నియిచ్చి య సురపతి......(శాంతి. 3 ఆ. ౫౧౨) క. బలియురఁ గృతవర్మాదుల నిలిపి (ద్రోణ. ౪ ఆ. 3౯) ద్విపద. పగతుల ననిలోన భంజించువాఁడు. (రంగ. రా. బా. 3 పు. ఆం. విశ్వ. ముద్ర.) ఇందలి శకటము ముద్రణసంస్కర్తృప్రమాదపతిత మనఁదగును.

నన్నయా ౧౯3 విషయము.

కాఁడు ర్గాఁడు ర్భవే దీఁడు । ర స్త్రిత్వాద్యర్థబోధకాః।
ఏకత్వ వాచకా త్పుంసి స్యా దాఁడు స్త్వన్యథా
మతః। స్త్రియా మాఁడి ర్బహుత్వే స్యా । త్పుంసి దీర్ఘా
న్నిరుచ్యతే. (వికృ. అజం. ౫౦-౫౧ కారి. అహో. 3౭౯ పు.)

కల్పతరు:—౧౯3 విష:—అ స్త్రిత్వాద్యర్థబోధకాః = కలుగుట మున్నగు నర్థములను బోధించు (ఆదిశబ్దముచే స్వార్థమును సంగ్రహించునది). కాడుః='కాఁడు' అనెడిది, పుంసి = మహత్త్వము వాచ్యమగుచుండఁగా, ఏకత్వవాచకాత్ = ఏకవచనాంతమునకుఁ బరముగా, భవేత్ = అగును. ఇట్లె 'గాఁడుః-ఈఁడుః' అనునవియు నగునని వేర్వేఱ నన్వయించుకొనునది. తద్ధితవృత్తియందుఁ బ్రథమైకవచనము లోపించును. ఉదా:—నేస్తముకలవాఁడు = నేస్తము+కాఁడు = నేస్తకాఁడు, అందముకలవాఁడు = అందము+గాఁడు = అందగాఁడు, కొండెముకలవాఁడు = కొండెము+ఈఁడు = కొండీఁడు. (అపదాదిస్వరసంధి నిత్యము. ౭౫ I విష.) ఆఁడుస్తు = 'ఆ' (ఁడు) ప్రత్యయమన్ననో, అన్యథామతః = వేఱువిధముగా సమ్మతమైనది. అనఁగా నిది యేకవచనభిన్న బహువచనాంతముపై నిల్చుననియు, నట్టిబహువచన ప్రత్యయము తద్ధితవృత్తియందును లోపింపదనియు దీనియన్యథాత్వమునకు వ్యాఖ్యచేయునది. స్త్రియామ్ = మహతీత్వము వాచ్యమగుచుండఁగా, బహుత్వేః

బహువచనాంతముమీఁద, ఆఁడిః = 'ఆఁడి' అనునది, స్యాత్ = అగును. ఉదా:— 'ఆఁడు' అనుదానికి; వగలుగలవాఁడు = వగలు+ఆఁడు = వగలాఁడు. 'ఆఁడి' అనుదానికి:—వగలుగలయామె = వగలు+ఆఁడి = వగలాఁడి. మొ. పైప్రత్యయములలో, పుంసి = మహద్వాచకములయందలి, దీర్ఘాత్ = "కా-ఈ-ఆ" అనుదీర్ఘములకుఁ బరముగా, నిః = న్యాగమము, ద్వితీయాదివిభక్తి పరకత్వమున, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది. ఉదా:—నేస్తకానిఁ, అందగానిఁ, కొండీనిఁ, వగలానిన్. మొ. ఈన్యాగమము నిత్యమెయని యెఱుంగునది. (బా. తద్ధిత. ౧౧ మొ. ౧౩ వ. ౧౪-౧౬-౨౨-౨౩సూ.)

"కా-ఈ-ఆ" అనియే తద్ధితప్రత్యయములను బేర్కొనుట యుక్తమైనను 'ఆ' ప్రత్యయకథనముచే ఆఁడ్యంతములగు 'వగలాఁడి' మున్నగునవి సంగ్రహింపఁబడ నేరమింజేసి "కాఁడు-ఈఁడు" మున్నగురీతిని వాని ప్రథమైకవచనాంతరూపములు పేర్కొనఁబడెను. 'స్యాదాఁడు స్త్వన్యథామతః' అనుచోటి యన్యథాత్వమునకు మఱొకవిధముగను వ్యాఖ్య చేయనగును. "ఆఁడుస్తు = 'వగలాఁడు' మున్నగుస్థలములందలి 'ఆఁడు' అనురూపమన్ననో, అన్యథామతః=వేఱువిధముగా సాధించుకొనఁబడుట సమ్మతము - అనఁగా "వగలయొక్క+వాఁడు" మున్నగురీతి విగ్రహముగల 'వగలవాఁడు' మున్నగు నాభాసబహువ్రీహిరూపషష్ఠీసమాసములందలి తచ్ఛబ్దవకారమునకు ౨౧౦ VIII విషయముచొప్పున లోపమునుజేసి 'అదాతోః క్వచిదేకతా' అనుచొప్పున నిత్యసంధిచేయఁగా 'వగలాఁడు' మున్నగురూపములు సిద్ధించునని తాత్పర్యము. ఈరీతిని వ్యాఖ్యచేసినపుడు పూర్వపువ్యాఖ్యచే సాధ్యముగాని మాయలయొక్క+వాఁడు = మాయలాఁడు మున్నగురూపములును సుసాధములు కాఁగలవు. 'ఆ' ప్రత్యయమన్ననో 'మాయలు' మున్నగుసంస్కృతసమబహువచనాంతములకుఁ బరముగా నిలుచుట సంభవింపనేరదు. శబ్దరత్నాకరమున 'మాయలాఁడి' అనిచూపుట పొరపాటు. (చూ. విస్తర. ౨౯౧ VII వి.) మాయలాఁడిట్లనియెఁ (పాండు. ౪ ఆ. ౯౮.) మ. ఇవియెల్లంగల మాయలాఁడు (హరి. పూ. ౮ ఆ. ౬౩) ఆఁడిప్రత్యయము పూర్వవాఖ్యచొప్పుననె వర్తిల్లును. "కా-ఈ-ఆ" ప్రత్యయాంతము లేకాదిగణములోనివని యీావఱకె నిరూపింపఁబడెను.(౧౩౭ విష). కాఁడు మున్నగునవి స్త్రీసమము లేమో యనెడిభ్రాంతి వారించుటకు న్యాగమవిధి యనువదింపఁబడెనని యెన్నునది. కాఁడు మున్నగురీతిని ప్రథమాంతములు వచింపఁబడుటచే 'న చ దేశ్యపదే' అనుచొప్పున హ్రస్వాభావము స్పష్టపఱుపఁబడినది. కాప్రత్యయము తత్సమపదములమీఁదను గన్పట్టుచున్నదని కొందఱయాశయము

"కోపగాఁడు. మి. విశే. (కోపము+కాఁడు) కోపముగలవాఁడు. గీ. నిను గల్గు యూ భర్త కోపగాఁ డనఁగనేల (సారం. ౧ ఆ.౧౧౪)క. ద్వైపాయనముని వెడలం ద్రోపిం చిన కోపఁగాఁడు ధూర్జటి.........(భీమ. ౪ ఆ. ౧౩) గీ. అన్న మీతండ్రి కోపగాఁ డగునో కాఁడో (కాశీ. ౪ ఆ. ౯౦)"(సూ. రా. ని.) ఈవిషయము, ముందు విమర్శితమగును. (౮౯౧ I విష.)

కేషాంచిద్ర్వన్తశబ్దానాం।తథా డుజ్; వారు రౌస్మృ
నన్నయా తౌ।నిత్యం లులౌరురౌస్యాతా । ముల్లోపో బహుళం
౧౯౩ I విషయము. డుజః. (వికృ. అజం. ౪౩-౪౦ కారి. అహో. ౩౩౪-
౩౭౯ పు.)

కల్పతరు. ౧౯౩ I విషః—కేషాంచిత్ = కొన్ని, ర్వన్తశబ్దానామ్ = బహు వచనలకారస్థానిక రేఫాదేశముగల శబ్దములకు (లులయో। స్తథాపుంసిరురౌస్మృతౌ. ౧౯౭ విష.) తథాడుజ్ = ఆప్రకారముగానే 'డుజ్' అనఁగా బిందుపూర్వక డువర్ణాగమమగును. "సలలో ర్బిన్దుయుతో డుర్వా.........నిత్యం దారాదేశ్చ స్యాత్........." అనుస్థలములందువలెనె బిందుపూర్వక డువర్ణాగమమును దాని యుల్లోపమును లులస్థానిక రుర పరకత్వమున వికల్పముగా నగును. కేషాంచిత్ = కొన్నియాచ్ఛికశబ్దములకు, వా = వికల్పముగా, రురౌ స్మృతౌ = బహువచన 'లుల'లచోట 'రుర'ల యాదేశమును గొన్నిటఁ బాక్షికముగ నగును. కొన్నిట రురాదేశమె పాక్షికమగునని యర్థము. లులయో స్తథాపుంసీత్యాదిచే (౧౯౭ విష.) నిత్యముగా వచ్చునుగానఁ గొన్నిటఁ బాక్షికతయుఁ గలదని చెప్పవలసెనని తాత్ప ర్యము. కేషాంచిత్ = కొన్నిటికి, లులౌ = బహువచనలులలు, నిత్యమ్ = నిత్య ముగా, రురౌస్యాతామ్ = రురలగుచున్నవి. డుజః = బహుత్వమందుఁ బయిరీతిని లులస్థానిక రుర పరకత్వమున నాగమముగావచ్చిన బిందుపూర్వకడువర్ణమునకు, ఉల్లోపః=ఉవర్ణలోపము, బహుళమ్=బహుళముగానగును. ఇట్లీకారికలు మూఁడు సూత్రము లగుచున్నవి. (౧) ర్వంతశబ్దములకుఁ బూర్ణబిందుపూర్వక డువర్ణాగమ తదుల్లోపములు పాక్షికముగా గల్గుట. వారు-వాండురు-వాండ్రు, వీరు-వీండురు- వీండ్రు. (౨౦౪ విష.) (౨) రురాదేశపాక్షికత:—"ఖండలయ్యెడక (కవిక) సీ. నలకూబరాదులు ననుపుమిండలు (కాశీఖండము)" (గ్రాణ, ఆచ్ఛి. ౬ ప. ౨౩౯ కారి.) మావటీలు - మావటీండ్రనియుఁ బ్రయోగించిరి. "తరలునని మావటీండ్రు కొందలపడంగ (కువలయాశ్వ)" (ఇట 'మావటీలు' అని నిల్పి నను క్షతి లేదు) (గ్రాణ, ఆచ్ఛి. ౭ ప. ౨౪౧ కారి.) ఉ.........ఉక్కీ-

లయి......(నిర్వ. 3 ఆ. ౧౧ ప. ప్రాసస్థానగతము) ఇట్టి ప్రామాణికప్రయోగములు మావటీండ్రు, గండండ్రు-మిండండ్రు మున్నగువానికి లభింపలేదు. "గండండ్రు-అల్లుండ్రు." (అహో. 3౪౯ పు.) "ఎల్లండ్రు" (అహో. 33౫ పు.) వీనిని బట్టియె కావలయుఁ బ్రయోగము చూపకున్నను-సూ. రా. నిఘంటువున 'అల్లుండ్రు' అనురూప మంగీకరింపఁబడెను. 'పగతుండ్రు' మున్నగురూపములు లేమిం జేసి పగతాదులలో నంగీకరింపఁబడిన "అల్లురు-ఎల్లరు" అనువానికి "అల్లుండ్రు-ఎల్లండ్రు" అను రూపాంతరము లున్నవనుట సరికాదని తోఁచుచున్నది. "అల్లుండ్రు" (శుక. 3 ఆ. ౧౧౪ పారట. గాణ. ఆచ్చి. ౬ ప. ౨3౯ కా.) అను నాధునిక సాధారణకవి పద్యఖండము చూపఁబడెను. (3) నిత్యరురాదేశనిత్యడుఙాగమములు. విలుకాండురు - విలుకాండ్రు - పగలాండురు - పగలాండ్రు - ఎనమండురు - ఎనమండ్రు - తొమ్మండురు - తొమ్మండ్రు - ఇరువండురు - ఇరువండ్రు - ముప్పండురు - ముప్పండ్రు. మొ. (౨౦౪ విష.)

ఈసూత్రములలోని బహుళశబ్దముచే "తేఁడులు - తేండ్లు" అనుచో రత్వము లేనిదే డుఙాగమ తదుల్లోపములను నట్లె "విలుకాలు-చెయివులు" మున్నగు చోటులందు బహువచనలకారమునకు శకటాదేశమును సంగ్రహింపనగునని వ్యాఖ్యానము చేసికొనవలయును. గీ. కాఁడునకుఁ గాలుకాండురుగలుగునండ్రు. (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౫ ప.)

కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫం

బాలవ్యా: బును దానికి ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు

౧౯౩ II విషయము నగు. ఉ.

గండండ్రు - మిండండ్రు - ఇత్యాదులు.

సంజీవని. ౧౯౩ I విష:—అర్థ. గండఁడు = శూరుఁడు, మిండఁడు = విటుఁడు. గండఁడు ప్రభృతులు మగాదులలోనివిగాన వీని కుత్వము రాలేదు; ద్వితీయాదులలో గండనిన్ - గండనిచేతన్ మున్నగురీతిని నిత్యనిగాగమము వచ్చును. "గండలు" అనియుండఁగా దీనిబహువచన 'లు' ప్రత్యయముచోట 'రు' అనునాదేశము వచ్చినపిదప దానికి ముందు పూర్ణబిందుపూర్వకడకారము (ండ్) నిల్వఁగా "గండ+ండ్+రు=గండండ్రు" అనురూప మేర్పడును. బిందుపూర్వక డు వర్ణాగమముచేసి యుల్లోపము చేయనేల యని సూరి బిందుపూర్వకడకారము నె విధించెను. సూరిగారికి 'గండండురు' అనురీతి నుల్లోపము లేనిరూపములు సమ్మతములు కామింజేసి యిట్టిరచన బాధకము కాదయ్యె (విస్తర. III ౨౦౪ విష.).

ఈసూత్రమును సూరి నిత్యవిధిగా సూత్రించుటంజేసి "గండలు - మిండలు" మున్నగురూపములు సంగ్రహింపఁబడవయ్యెను. "మిండలయ్యెదర్ (కవికర్ణ.) నల కూబరాదులు ననుపుమిండలు" (కాశీ. ౫౦) (గాణ. ఆచ్ఛి. ౬ ప. ౨౩౯ కా. వివృతి.)

కా ప్రత్యయాంతంబుమీఁది బహువచనలకారంబునకు
బాలవ్యాకరణ లఘ్వలఘు రేఫంబులు లఘు రేఫంబునకు ముందు బిందు
వివరణము. పూర్వక డకారంబు నగు. ౭.
౧౯౪ విషయము. విలుకాండ్రు - విలుకాఱు; వేఁటకాండ్రు - వేఁట
కాఱు; వేడుకకాండ్రు - వేడుకకాఱు.

సంజీవని. ౧౯౪ విష:—అర్థ. విలుకాఁడు = ధనుర్ధరుఁ వేఁటకాఁడు = మృగయుఁడు, వేడుకకాఁడు=క్రీడాసక్తుఁడు = విటుఁడు.

"కా-ఈ-ఆ" అను ప్రత్యయములు సూరిచే మగాదిగణమునఁ బఠింపఁబడినవి గాన (బా. ఆచ్ఛి. ౪ సూ.) వీనికి నిగాగమము నిత్యము. ఉదా:—విలుకానిన్ - వేఁటకానిన్. మొ. దీర్ఘముమీఁది దగుటంజేసి సూత్రములోని 'బిందుపూర్వక' అనుదానికి 'పూర్ణబిందుపూర్వక' అనియే యర్థ మేర్పడును. ఉదా:—విలుకా+లు= విలుకా+ండ్+రు = విలుకాండ్రు, 'విలుకా+లు' అనుచో లకారమున కలఘురేఫా దేశమురాఁగా "విలుకాఱు" అనురూప మేర్పడును. బిందుపూర్వకవ్యంజన డకారా గమవిధానముచే నథర్వణసమ్మతముగు "విలుకాండురు" అనురూపము సూరిపక్షమున సంగ్రహింపఁబడదయ్యె. (విస్తర. III ౨౦౪ విష.). వేడుకకాండురకు నిచ్చు వివిధార్థంబుల్ (విక్ర. ౨ ఆ.) ప్రయోగములు. ఉ:—వేడుకకాండ్రకై తిరుగు ్రల (ఉ. రా. ౪ ఆ.) (శ-ర.) క. పాఱెడు నీరెడ త్రెవ్వఁగ।దాఱ బెడిదమైన యెండ దనుకఁగ నివురం।బాఱె మడు వంత వేడుక।కాఱును జాలరులు చూచి క్రందుకొనంగన్ (శాంతి. 3 ఆ. ౧౯౨ ప.) తరువోజ. తెక్కలికాఱుదోఁతెంచి రాతనికి (స్త్రీ. ౧ ఆ. ౪3) ఉ. కన్నది లేదు మెల్ల మురికాఱు దిగీశులు (నిర్వ. ౬ ఆ. ౧౨౭) (మురికాఱు = గర్విష్ఠులు) గీ. కాఁడునకుఁ గాఱుకాండురు గలుగు నండ్రు (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౫ ప.) సూరి 'ఆ' ప్రత్యయాంతములవిషయము నీసందర్భమున స్మరింపలేదు. 'వగలాఁడు' మున్నగునవి 'వగల+వాఁడు' అనురీతినే యేర్పడియుండవచ్చును. కాఁగా 'వాండ్రు' అనుదానిరూపముతో "వగలాండ్రు" మున్నగురూపము లంగీకరింపఁదగినవే యనఁదగును. కాని యట్టిప్రయోగములు లభింపలేదు. 'ఈ' ప్రత్యయాంతముల బహువచనముల కిట్టిరూపము కన్పట్టలేదు. ఉ. కూలినవారిఁ జూచి........ఉక్కిలియై నేర్పులేక తమకించి...(నిర్వ. 3 ఆ.

౧౧) ఉ. బాలురు........ఉక్కీల్తుయి యిచ్చి (హరి. పూ. భా. ౧ ఆ. ౭౨ ప.) గీ. దొరలు ప్రెగడలు మన్నీలు బిరుదులొజ్జలూడిగీలు. (అచ్చ రా. అయో. ౫ ప.) గాణపత్యవివరణకర్త యీ క్రింది ప్రయోగమును జూపెనుగాని యది ప్రామాణికము కాదు. ఆకవియైనఁ బ్రయోగించెనని విశ్వసింపఁదగియు నుండలేదు. గీ. తరలునని మావటీంద్రు కొందలపడంగ (కువలయా. గాణ. ఆచ్చి. ౮ ప. ౨౮౧ కారి. వ్యా.)

బాలకవి శరణ్యమున “దండి తెక్కలికాండ్లకు మిండగీండ్లకు...(అచ్చ. తె. భా. పు. ౫౮౩) ముత్తుగాండ్లు (బసవ. III-ఆ. పు-౭౯.) సంగడికాండ్లు(రాధా. ౧ఆ. ౮) జూదరికాండ్లు (సానం II ఆ. ౨౯)” (బాలక. ౧౬౨ పు.) మున్నగు ప్రయోగములు చూపఁబడెను. పైయన్నిటను ‘మిండగీండ్రు’ మిండగీలు’ మున్నగురీతిని వానివాని చోట్లఁ గవులు ప్రయోగించిరేమో యనుటలో క్షతియేమియు లేదు. ప్రాచీన వైయాకరణులు చెప్పినవ్యాకరణవిషయములను మీఱుటకుఁ బ్రాచీనాధునాతన మహాకవులు ప్రయోగించిరని విశ్వసింపఁదగినప్రయోగములను జూపుట యత్యావశ్యకము. తప్పులతిప్పలగు తాటియాకులపుస్తకమునుండియుఁ దన్మూలకములగు తప్పులముద్రణములనుండియు దొరకిన యెల్లకవులప్రయోగములను జూపుచు కేవల వ్యావహారికశబ్దములకుఁ బ్రామాణ్యమును గల్పించుట సరికాదు.

బాలవ్యాక ౧౯౫ విషయము. త్రేప్రభృతులబహువచనమునకు ముందు డుజ్జగు. ౮.

తేఁడులు - తేండ్లు.

సంజీవని. ౧౯౫ విష:—దీనికి నన్నయాథర్వణులమూలము కానరాదు “జనాన్యత్రగతశబ్దానాం।భూయసీ స్యాద్విచిత్రతా. (౧౮౮ విష.) భూయసీ దేశ్యశబ్దేషు।లోపవర్ణాగమశ్రుతిః (౮౮ I విష.)” ఇత్యాదివచనములె దీనికి గతియని తోఁచుచున్నది.

డుజ్జగుననఁగా బిందుపూర్వకడువర్ణకమగునని యర్థము. అయ్యది దీర్ఘపూర్వస్థలములోనిదిగాన ఖండబిందుపూర్వకడువర్ణమె యాగమమగునని తాత్పర్యము. ఉదా:—తే+ఁడు+లు = తేఁడులు. దీనిలోని ‘డు’ వర్ణముమీఁది “ఉ” కారమునకు, బా. అచ్చి. ౧౨ సూత్రముచొప్పున వైకల్పికముగా లోపమురాఁగా “తేఁడ్లు” అగును. బా. అచ్చి. ౧౫ సూత్రముచొప్పున నిండలిసంయోగపరకఖండము నిత్యముగాఁ బూర్ణముకాఁగా “తేండ్లు” అనుసాధురూప మేర్పడును. ‘తేఁడ్లు’ అనునది ప్రక్రియామధ్యావస్థలోనిదిగానఁ బ్రయోగార్హముకాదు. గీ. పుడమిలోనఁగల్గు పుడమితేఁడులకెల్ల (అచ్చ. రా. బాల. ౧౨౯) గీ. తపసితేండ్లకు నెఱిఁగింపఁ దనివి సనక (నీలా. ౧ ఆ. ౧౧ ప.). తేశబ్దమునకుఁ ద్వితీయా

ద్యేకవచనపరకత్వమున నిగాగమము కవిప్రయుక్తముగుటంజేసి యిది స్త్రీపము మన రాదు. క. తేని యనుమరణమునఁ దన। మేనువిడిచిఁగట్టి కాంత...(శాంతి. 3 ఆ. 33౪ ప.) క. తేనికి సంతసముచేసి తేనిరికడఁకఁ. (య. ౨ ఆ. శ. ర.)

ఏకత్వేచ భవే ద్వారు। స్తథా రౌచ భవే త్క్వచిత్
నన్నయా (వికృ. 3౫ కా. అజం. అహో. 3౦౮ పు.)
౧౯౬ విషయము. తయో శ్శసాదౌ రేమాత్ర।ఉదతోః ప్రాయశోఽత్ర
ఇత్ (వికృ. అజం. 3౬ కా. అహో. 3౦౦)

కల్పతరు:—౧౯౬ విష:—ఈకారికలు వా ములు. (౧౯౨ విష.). 'కూఁతురు - కూఁతు, కూఁతురులు - కూతులు' (అహో. 3౦౮ పు.). అని యహోబలపతి యుదాహరించెను. ఇట్లథర్వణోపదిష్టము ల నహోబలపతి యుదాహరించెనని యరయక బాలకవి శరణ్యకర్త "విన్నకోట పెద్దిరాజు చెప్పినలక్షణములో కూఁతురిని ఉన్నది. గాని కూతురులు లేదు. తర్వాత నహోబలుఁడు 'కూఁతురులు' అనేరూపము చేర్చుకొన్నాఁడు." అని యిట్లు 'కూఁతురులు' అనునది పెద్దిరాజునాఁటికి లేనట్లు వ్రాసెను. (బాల. శర. ౪౫ పు.) ఏకత్వమునందంతటను బాహుళికముగా రువర్ణాగమ మగుననియు బహుత్వమున 'లు' ప్రత్యయపరకత్వమున మాత్రము క్వాచిత్కముగా 'రు' వర్ణాగమమగుననియు నథర్వణుఁడు పై కారికతో నవరించెను. కవిత్రయమువారి ప్రయోగములందన్నోయొక్క ప్రథమైకవచనము నందుమాత్రమే 'రు' వర్ణాగమము కూఁతుశబ్దమునకు నిత్యముగాఁ గన్పట్టుచున్నది. కేతన యిట్లు వచించెను. క. కూఁతురుపదము రుకారము। భ్రాంతిగఁదాఁ జెడు విభక్తిపైఁ బెట్టినచో।గూఁతురు గూఁతుం గనియెను।గూఁతులచేఁ గూఁతువలనఁ గూఁతుల ధనముల్ (ఆ. భూ. ౯౯ ప.). అట్లయినను నథర్వణుఁడు తనకాలమున వాడుక కెక్కినకవులయాదృతిని గాంచిన రూపములను దానును సమ్మతించి పైరీతిని సూత్రించెను. విన్నకోట పెద్దిరాజు కేతనవలెఁగాక చాలవఱ కథర్వణుని రీతినె వచించెను. కాని కేతన పెద్దిరాజు లిద్దఱును నన్నయాథర్వణకారికలను జూచినవారు కారు. గీ. పరఁగఁ గూతురుశబ్దంబు పై రుకార। మొక్కపలుకునఁ బైనైన నుండుఁబాయుఁ। బెక్కుపలుకుల పైనైనఁ దక్కిపోవు।కూఁతురుగఁ బొందెఁ గూఁతు గాఁ గోరె ననఁగ. (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౧౧ ప.) ('కూఁతుఁ బడసెను గూఁతుఁగాఁ గోరె ననఁగ' అని గిడుగువారిచతుర్థచరణపాఠము) బహువచన లుప్రత్యయపరకత్వమునందును గ్వాచిత్కముగ రుగాగమ మగు ననువిషయమునుమాత్రము పెద్దిరాజు వచింపలేదు.

కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు. ౯.
బాలవ్యాకరణ కూఁతురు - కూఁతులు, కూఁతురులు - కూఁతుళ్ళు,
౧౯౬ I విషయము. కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యె
ఱుంగునది.

సంజీవని. ౧౯౬ I విష:—భారత ప్రయోగములను గేతనవచనమును మూల ముగాఁ గొని 'కూఁతురులు' మున్నగునవి గ్రామ్యములనఁగా నసాధువులని సూరి వచించెను. ప్రామాణికుఁడగు నథర్వణునివంటివాఁ డేకత్వమున నన్నివిభక్తులందును రువర్ణాగమము నంగీకరించియుండఁగా నట్టి యథర్వణాశయముల నంగీకరింపకుండు టయేకాక యట్టిరూపములు సూరి గ్రామ్యములనుట పొరపాటు. ఇట్లు ద్వితీయా ద్యేకవచనములందు రువర్ణాగమమునె యంగీకరింపని సూరి దాని కిత్వము వచింప కుండుట వింతకాదు. ఆంధ్రభాషాభూషణమందును గావ్యాలంకారచూడామణి యందును "కూఁతురుపదము-కూఁతురుశబ్దము" అని రువర్ణాంతమె స్త్రీసమమనియు విభక్తిపరకత్వమున దానితుదిరువర్ణము లోపించుననియుఁ జెప్పఁబడినను బ్రామాణి కాగ్రగణ్యుఁడగు నథర్వణుఁడు 'రు' వర్ణమాగమమని వచించుటచేత సూరి వ్రాసిన రీతినె "కూఁతు" అనునదే ప్రకృతియని గ్రహింపనగును.

సూ. రా. నిఘంటుకర్తలు నుడివిన ట్లిది మొదట స్త్రీశిశువాచకమగుట నర యఁగా దీనికి 'కూన' శబ్దము మూలమనియు నద్దానిపై స్త్రీప్రత్యయ తకారము చేరుటచేత మొదట "కూంతు" అనియుఁ గాలక్రమమున బిందువు తేలఁగా'కూఁతు' అనియు నేర్పడియుండునని యూహింపనగును. (బాలకవిశరణ్యము ౨౧ పుట. చూ.) (విస్తర. I)

విస్తర. I ౧౯౬ I విష:—"చిన్నయగారు బెదరగొట్టినవారి అపస్మృతి వ్యాకరణమందు 'కూఁతుశబ్దము ప్రథమైకవచనమునకు రువర్ణంబగు' అని ఉన్నందున కూఁతురుశబ్దమునకు కూఁతురూపాంతర మనుకొని 'కూఁతు' అనేరూపమె ప్రథమైక వచనముగా వాడుతున్నారు కొందరు.........శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు తమభారతములో(ఆది. IX - ఆ. ౧౯) తే. కూఁతు జగదేకకీర్తిరయై తలిర్చు|...... కూఁతు వైతివికదవే (౫ ఆ. ౫౬) (బాల. శర. ౨౯-30 పుటలు.) అని వ్రాసి నారు.........ఛీ-ఛీ. (బాల. శర. ౨౯-30 పు.)" అని శరణ్యకర్తగారు మిక్కిలి దురుసుగా వ్రాయుట యుక్తముకాదు. 'కూఁతు' అను స్త్రీసమశబ్దమునకే యథర్వణా చార్యుఁడు పాక్షిక రువర్ణాగమమును నేకత్వమున విధించెనుగదా. నేఁటి సూ. రా. నిఘంటుకర్తలును "కూఁతు" శబ్దమును వేఱుగను "కూఁతురు" శబ్దమును వేఱు

ప్రయోగములు:—క. జలజాక్ష్యంతక కశ్యప|కులభామినులై నెగడ్తకుం జని బహుపు|త్త్రులఁబడసి పేరుకొను కూఁ|తులఁ జూడఁగ నరిగె నతికుతూహలబుద్ధిన్. (నన్ని. కు. ౧ ఆ. ౧౧౧ ప.) సీ. పడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతుల, నిప్పాట (ఆది. ౩ ఆ. ౫౧) సీ. ఈయేవురకుఁ గూఁతు నిచ్చి వివాహంబు (ఆది. ౭ ఆ. ౨౫౬) సీ.........కౌఁగిలించి|కొని తల్లి నీవు నాకూఁతురవేను నీ; జననియు...(అర. ౨ ఆ. ౧౫౧ ప.) ఇట్లె భారతమునందంతటను బ్రథమైకవచనస్థలములందుమాత్రమె రువర్ణాగమము కన్పట్టుచున్నది. (ఆది. ౭ ఆ. ౮౭; సభా. ౧ ఆ. ౧౩౬; అర. ౨ ఆ. ౮; ఉర. మొ. ఆ. వె.) కోరియిచ్చెఁ దనదుకూఁతులముప్వుర. (నిర్వ. ౨ ఆ. ౮౩.)

ఏకత్వమున నితరవిభక్తులలో రువర్ణాగమస్థితికిఁ బ్రయోగములు. క. ఏనటె నాకూఁతురినటె|మానవుఁడటె నగరుసొచ్చి...(ఉ. హరి. ౫ ఆ. ౨౧౭.) క. కూఁతులచేఁ గూఁతురిచేఁ|గూతురికై కూఁతుకొఱకుఁ గూఁతులవలనన్. (కావ్యాల. ౯ ఉల్లా. ౧౧౨ ప.) సీ. పంటతామరకంటిదంట కూఁతురిమోవి...(అహో. ౫౧౮ పు.) ఈప్రయోగ మహోబలపండితునిదె. సీ. తెలుఁగంటిరాచకూతురిఁ గైకొనినజాణ... (చంపూ. రా. ౩ ఆ. ౮ ప. బాల. శర. ౩౫ పు.) చ. తిరముగ మింట వేవెలుఁగు...

---

గను జూపియున్నారు. సీ. పుత్త్రికాహ్వాయ మొప్పఁ గూఁతు కొమారిత, కూఁతురనఁగ...(ఆంధ్రభాషార్ణవము. ౨ ఆ. ౧౧౧) అని యాంధ్రభాషార్ణవమందును నంగీకరింపఁబడెను. " 'అహోబలపండితుఁడు కూఁతు - కూఁతురు - కూఁతురులు - ఇత్యాది.' అని సందిగ్ధముగాఁ (సందేహమేమియు నిచటలేదే) జెప్పినాఁడు" అని శరణ్యకర్తగారే యుదాహరించియు నున్నారు. ఇట్టిస్థితిలో 'చిన్నయ'గారుచేసిన తప్పేమి? బ్ర-శ్రీ కళాప్రపూర్ణ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారుచేసిన యపరాధమేమున్నది? ఏదేని లోపముండిన నుండుఁగాక 'ఛీఛీ' అని విమర్శకులనోట రానగునా?

"కూఁతు అని విడిగాఁ బ్రథమైకవచనరూపము కర్తగా ఎక్కడా కనఁబడలేదు. నాకంటికి" (బాల. శర. 3 పు.) అనుశరణ్యకర్తగారిమాట నిజమే. నాకును నట్టిది మహాకావ్యములందుఁ గన్పట్టలేదు. కాని యథర్వణాచార్యుని యంతటివాఁడు కంఠోక్తముగా నది సాధువని వచించియుండఁగా నయ్యది యెట్లు నిరాకరింపఁదగినదగును? ఆతఁడు సూత్రించుట యొకటి! ప్రయోగించుట వేఱొకటి యునగునా? శరణ్యకర్తగారే కనిపెట్టి యంగీకరించి యుదాహరించియున్న విన్నకోట పెద్దనార్యునిపద్యముసైతము 'కూఁతు' అనుపాఠికప్రథమైకవచనరూపమును సాధువుగా సమ్మతించుచునే యున్నది గదా.

కూఁతురి చెలువంపుతేని ... (బహుళా. ౧ ఆ. ౮ ప. బాల. శర. ౩౭ పు.) పైస్థలములందెల్ల "తయోః శ్వసాదౌ రేమాత్ర ఉదతోః ప్రాయశోఽత్ర ఇత్" (౧౯౭ విష.) (వికృ. అజం. ౩౬ కా. అహో. ౩౦౦ పు.)అనుచొప్పున ద్వితీయాద్యేకవచన పరకత్వమున 'ఇ' కారమువచ్చి 'కూఁతురిఁ' మున్నగురూపము లేర్పడెనని యెఱుంగునది. (విస్తర. II )

విస్తర. II ౧౯౬ I విష.—"ఉత్తరాంధ్రములో 'కూఁతురు' ప్రాతిపదికము. ఊరు - నగరువలెనే ఔపవిభక్తికము. కూఁతురిని - కూఁతురికి - కూతుళ్ళు = (ర్లు) అనేరూపములు దానినుండివచ్చినవి" (బాల. శర. ౪౨ పు.) అని శరణ్యాకర్తగారు వ్రాసిరి. "ఇది తొలుత ననౌపవిభక్తికముగనుండి కాలక్రమమున నౌపవిభక్తికమైనది. కూఁతురికి..." (ఆం. భా. అ. శబ్ద. ౭౭ సూ. వివృతి.) సూ. రా. నిఘంటుకర్తలును "కూఁతురు = కూఁతు...వి-ఔ" అని యిట్లు దీని నౌపవిభక్తికముగనే వ్రాసిరి. ఇట్లె వీరు "ఆల్వా"దులనుసయితమౌపవిభక్తికములనియే వచించిరి. "కాలు- కాలిని - కాలితోఁ - కాలిక్రింద - ఇట్లు మోకాలు - వ్రేలు - కోడలు - మఱదలు - చెల్లెలు...ఆలు. మొ." (ఆం.భా.అ.శబ్ద. ౧౩౦ సూ.) అని యనుశాసనమున వ్రాయఁబడెను. "ఆలు. వి-ఔ" (సూ. రా. ని.) అని యిట్లుగ "ఆలు" ప్రభృతి శబ్దము లౌపవిభక్తికములని సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెను. వైయాకరణ సంప్రదాయములను బరిశీలించునపుడు 'కూఁతురు' శబ్దమును నాల్వాదులును నౌపవిభక్తికము లనరాదని తోఁచుచున్నది. ప్రాణివాచకము లౌపవిభక్తికములగుట కవి పండితసంప్రదాయము కాదు. ఔపవిభక్తికముల ముఖ్యలక్షణమగు "తృతీయాసప్తమ్యర్థకమైన "అత్వము" వీనిపై నిలువనేరదు. "కూఁతురఁ = కూఁతురిచేతను, కూఁతురియందును; ఆలఁ = ఆలిచేతను, ఆలియందును" అనుస్థితి యెంతమాత్రము లేదు. ప్రామాణికులగు వైయాకరణు లెవ్వరును నీశబ్దము లౌపవిభక్తికము లని వచింపలేదు. ఉదాహరింపను లేదు. ఇట్లు కూఁతుశబ్దమునకును "ఆలు" ప్రభృతులకును బ్రాణివాచకములగుటంజేసి యౌపవిభక్తికత్వము దుర్ఘటమని తలంచియే ప్రామాణికాగ్రసరుఁడగు నథర్వణుఁడు వీనికి "తయోః శ్వసాదా విత్యాదిసూత్రముచే నిత్వమును బ్రత్యేకముగ విధింపవలసినవాఁడయ్యెను.

అహోబలపతి కూఁతురుశబ్దపు టిత్వమువిషయమును స్మరింపకున్నను నాలు ప్రభృతులయిత్వము కయి యథర్వణవచనముచొప్పున వచ్చినదనియె సాధించెను

గాని వైయాకరణసంప్రదాయవిరుద్ధముగ బ్రాణివాచకములగు కూఁతురుశబ్దమునకుఁ గాని యాల్వాదులకుఁగాని యిత్వ మౌపవిభక్తికత్వమున వచ్చెనని వ్రాయలేదు. కాని యీతఁడు "తయోశ్శసావా విత్యాదికారికను సరిగా నర్థము చేసికొని సరిగ నుపయోగించికొనలేదు.

"ఏకత్వేచ బహుత్వేచ।సంబన్ధే దివివర్ణకౌ।తయోశ్శసాదౌ సేమాత్ర।ఉదతోః ప్రాయశోత్ర ఇత్. వారిది-వారివి - వారిఁ-వీరిఁ-వారిచేతఁ - ఆలిఁ-ఆలిచేతఁ ఇత్యాది. వారిమాత్రము - వారిగుణములు - అతస్తు - అక్కడివారు - ఇక్కడివారు-తోఁడివారు...అయంశబ్దః సహచరశబ్దపర్యాయః..." (అహో. ౩౧౦) అహోబల పండితుఁడు పయియథర్వణకారికల నమకుటలోఁ గొంత పొరవడి తడఁబాటుగ నుదాహరించె ననకతీరదు. 'వారు వీరు' అను ప్రథమాబహువచనములమీఁద 'వి' వర్ణకము నిల్చెననుట యొకపొరపాటు. సంబంధార్థమునవచ్చు 'ది-వి' వర్ణకములు షష్ఠ్యర్థమున నిల్చునుగాని యెన్నఁడును బ్రథమాంతములపై నిల్వనేరవు. అట్లె కానిచో 'ది'వర్ణకము "వాఁడు - వీఁడు" మున్నగువానిపై నిల్చి 'వాఁడిది - వీఁడిది' మున్నగు ననిష్టరూపములు సంభవింపవలసివచ్చును. కాఁబట్టి "తయోశ్శసాదౌ" విత్యాదికారికలోని 'తయోః' అనునది 'ది-వి' వర్ణకపరము కామింజేసి 'ఏకత్వేచే' త్యాదికారికతో "తయోశ్శసాదౌ" విత్యాదికారికను జోడింపరాదు. మఱియు వారిఁ - వీరిఁ - వారిచేతఁ మున్నగుద్వితీయాదిబహువచనరూపములను సాధించు ప్రక్రియలో "వారు - వీరు" మున్నగు ప్రథమాబహువచనాంతములపై శసాది ప్రత్యయములు నిల్చుట కేవలము నసంభవము. కావున నాయోజించినరీతినే 'తయోశ్శసాదౌ' విత్యాదికారికను సమన్వయించుట (౧౯౨ విష.) యుక్తము. ఆకారిక చెప్పున 'అ' త్తున కిత్త్వమువచ్చుటకు "అతస్తు - అక్కడివారు..." (అహో. ౩౧౦ పు.) అని యిట్లక్కడాదిశబ్దముల నహోబలపతి యుదాహరించుటయు సరి కాదు. అక్కడాదు లౌపవిభక్తికములగుటచేతనే వాని కిత్త్వము లభించును. 'తోఁడి వారు' అనునహోబలోదాహృతియు సరికాదు, అట్టియెడల "ఇచ్చువిభక్త్యుక్తిరుస్య" అనుచింతామణిసూత్రముచెప్పుననే (౧౦౫ విష.) ఇత్త్వము వచ్చును. (విస్తర. ౧౦౫ I విష.). ఈపక్షమున "ప్రాయోగ్రహణాత్ - తోడఁబుట్టువు ఇత్యాదౌన" (అహో. ౩౧౦ పు.) అని యహోబలపతిచూపిన యనుపపత్తికే ప్రసక్తి యుండఁ బోదు. మఱియు నహోబలపతి సమన్వయించినరీతి నత్త్వమున కిత్త్వమువచ్చుట నంగీకరించునపుడు "వారిఁ - వీరిఁ - వారిచేఁ - వీరిచేఁ." మున్నగుస్థలములలోని యిత్వమును సంపాదించుసూత్రమె నన్నయాథర్వణీయమున లేకపోవలసివచ్చును.

బహువచనమున 'రు' వర్ణాగమముగల ప్రయోగములు:- చ...ఇత్తునీతని యనుజత్రయంబునకుఁ దక్కినకూఁతురులన్ భవత్కృపన్ (రామా. ౪ ఆ. ౯౬ ప. సూ. రా. ని.) చ...డగ్గఱుటయు రాచకూఁతురులగాలికి...(చంపూ. రా. ౨ ఆ. ఆం. భా. అ. ప్రయోగ. విశే. ౧౮ సూ) అథర్వణుఁడు "లొచభవే"త్తనుచుఁ బ్రథమాబహువచనమునందే వచించినను నట్టి 'లు' వర్ణకము బహువచన లకారమునకును నుపలక్షణమగునని వ్యాఖ్యచేసికొని యిట్టిప్రయోగములను సమర్థించి

---

ఇట్టి యహోబలపండితీయప్రామాదికమార్గముననే తదనుయాయివ్యాకర్తలెల్ల పైకారికల నదికి సమన్వయించుటచే వారివారివివరణములను వేఱుగ విమర్శింప నక్కఱలేదు. కవిజనమండనకర్తయుఁ దదనుయాయి నారాయణీయగాణపతవివరణకర్తలును "తయో శ్శసాదా" అనుచో "తయోరమాదా" అనుపాఠము నంగీకరించిరి. (విక్ర. అజం. ౩౬ కారి. నారా. గాణ. ఆచ్ఛి. ౨౪ ప. ౨౫౭ కారి.) ఈపక్షమున నేకత్వమునం దిత్వమునకుఁ బ్రసక్తియేలేమింజేసి 'శసాదా' అనుచో "అమాదా" అనుసవరణము నిష్ప్రయోజనము.

బాలకవిశరణ్యకర్తగారు. "సీ. వినుము గాంధారి... ఎ.గీ...।రాచకూఁతుండ్రు సుతుల సంగ్రామనిరత।హృదయు లగువారిఁ గాంచఁగోరుదురకాదె" (స్త్రీ. ౨ ఆ. ౧౬౬ ప.) (బాల, శర. ౪౦ పు.) అనుసోమయాజిప్రయోగమును జూపుచు "కూఁతుండ్రు" అనురూపము సాధువె యని వచించిరి. కూఁతురుశబ్దబహువచన లకారమునకు రత్వ మెవ్వరికిని సమ్మతముకామింజేసి "కేషాంచిద్ర్వ్యన్తశబ్దానా"మ్మను (౧౯౩ I విష.) బిందుపూర్వకడువర్ణవిధాయకశాస్త్రము కూఁతుశబ్దవిషయమున నెంతమాత్రము ప్రవర్తింపనేరదు. అట్టి బిందుపూర్వకడువర్ణవిధాయకశాస్త్రము దీని విషయమున వేఱొకటిలేదు. మఱియు శరణ్యకర్తగారు చూపినప్రయోగము లేఖకాదిప్రమాదకృతమేకాని కవిప్రయుక్తముకాదు. తాళపత్రమాతృకలలో "రాచకూంతుులు సుతుల సంగ్రామనిరత..." అనియె యున్నదిగాన నచట "రాచకూఁతులు సుతుల" అనియే సోమయాజిప్రయుక్తపాఠమని విశ్వసింపఁదగును. శరణ్యకర్తగారు చూపుప్రయోగములలో నేవో యలంతిస్థలములుతప్పఁ దక్కినవెల్ల నిట్టిప్రక్షిప్తము లనఁదగినవె యైయుండును. ప్రాచీవ్యాకరణసమ్మతములుకాని యపూర్వరూపములను సాధింపఁదలఁచినపు డట్టిరూపమును నిర్వహింపఁదగిన ప్రామాణికకవిప్రయుక్తమని విశ్వసింపఁదగిన ప్రయోగములను జూపవలదా? ఈదుర్బలప్రయోగమె పెక్కురు నేఁటివ్యాకర్తలు చూపుచున్నారు. (ఆం. భా. అ. శబ్ద. ౭౮ సూ. బాల. శర. ౨౦౦ పు.) (గాణ. ఆచ్ఛి. ౧౧ ప. ౨౪౪ కా. వివ.)

కొనవలసియున్నది. ప్రథమాబహువచనమున రువర్ణాగమమువచ్చుట కొంకసామాన్య నవ్యకవిప్రయోగము కన్పట్టుచున్నది. ఆ. వె-ఘనవిలాసవతులు కౌసల్య కైక సుమిత్ర యనెడువేళ్ళఁ బేర్మిమీఱ హరిశనునకు ముప్వురనుఁగుకూఁతుళ్ళు వారల వరించు నంచుఁ దెలిసె నధిప. (నిర్వ. వి. రా. ౫౭ పు. బాల. శర. ౪౧ పు.) 'కూఁతుళ్ళు' అనురూపము 'కూఁతురులు' అనుదానినుండియె లభింపవలయును. వేరులు = వేళ్ళు నీరులు = నీళ్ళు, (౧౯౯ విష.) అనురూపములు ప్రసిద్ధములె మఱియుఁ బ్రకృతపద్యమున "కూఁతుళులు" అని కవి ప్రయోగించియుండిన నుండ. వచ్చును. కాని యథర్వణాంగీకృతమగు నిట్టిరూపమునకుఁ బ్రాచీనప్రామాణికకవి ప్రయోగము లభింపకున్నది.

బాలవ్యాకరణ చెయువు బహువచనలకారమున కలఘురేఫంబు
౧౯౭ విషయము. విభానగు. ౧౦.

చెయువులు-చెయువులు, చెయువులను-చెయువులను.

సంజీవని. ౧౯౭ విష:—అర్థ:—చెయువు = చెయ్వు = కృత్యము. చేష్ట-పని. సూరి యెట్టిప్రమాణము నాశ్రయించి చెయువుశబ్ద బహువచనలకారమున కలఘురేఫాదేశమును బాక్షికముగనైన విధించెనో తెలియకున్నది. ఇట్టివిధిని నిర్వహింపఁజాలు యతిప్రాసాదిస్థలనిబద్ధప్రామాణికప్రయోగము లభింపలేదు. ప్రాచీన వైయాకరణులును నిట్టిరూపము నుపదేశింపలేదు. ఇంతియకాక ప్రాసస్థలనిబద్ధ బహువచనలకారఘటితప్రయోగములె యగపడుచున్నవి. క. కళలంటి కరఁచి తనచెయ్వులఁ జొక్కెడు తపసి మది చివుక్కురు మనఁగా!...(కళా. ౩ ఆ. ౪౭) వావిళ్ళవారిముద్రణమున నొకభారతప్రయోగమున శకటము గన్పట్టుచున్నది. సీ. పలుకులఁ జెయ్వులఁ బాండవులకుఁ బ్రీతి...(ఆది. ౮ ఆ. ౨౧ ప.) ఇది యతి ప్రాసాదిస్థలనిబద్ధముకామింజేసి కవిప్రయుక్తమెయని విశ్వసింపఁదగినదికాదు.అట'చెయ్వుల' అనియె కవి ప్రయుక్తమనుకొనుటకుఁ బాధ చూపట్టదుగదా. ఇట్లు ప్రమాణము లభింపని యీరూపమును సాధించి సూరి భారతప్రయోగసమ్మతములగు 'చూపఱు-పగఱు' అనురూపములను సాధింపఁడయ్యె. చూపఱు = చూచువారు, పగఱు = పగవారు. క. కఱకంఠవరము నాకుఁ బగఱఁ బరిమార్పంగ శక్తి గలుగఁగ నిమ్మా (శౌప్తి. ౧ ఆ. ౧౨౦ ప.) క. మెఱయు వెలిమావులును గడు మెఱుఁగారెడునరదములును మింటను మంటల్ పఱపెడు వాలమ్ములు చూపఱ నత్తొలితాఁకు వెఱఁగుపడఁజేసె నృపా. (కర్ణ. ౩ ఆ. ౨౭౮ ప.) క. కొఱవియుఁ గొఱవియుఁ దాఁకిన లెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడు చూపఱు వొగడఁ దాఁకుటయు నిద్దఱ దిక్కుల (భీష్మ. ౧ ఆ.

౨౮౮ ప.) 'చూపఱులు' అనియుఁ గలదు. (౨౦౮ విష.) ఏ-గీ-చూపఱులచూడ్కి-కొక వింత సొబగొనర్చె (కళా. ౭ ఆ. ౭౬ ప.) "చూపఱు - చూపఱులు. చూపరి ఇతి ఇదన్తమపి రూపాన్తరమ్" (అహో. 33౫ పు.) ఈవ్రాఁత ప్రామాదికము. "చూపఱు. ద్వి. విణ. (చూపు+వారు) చూచువారు." (శ.ర.) "చూపరి. ద్వి. విణ. (చూపు+అరి) చూడఁదగినవాఁడు. సౌందర్యవంతుఁడు." (శ.ర.) అను చొప్పున 'చూపఱు - చూపరి' అనునవి విభిన్నశబ్దములు. ఒకటికొకటి రూపాంతరము కానేరదు.

పయి నుదాహరించిన భారతప్రయోగదృష్టములగు "చూపఱు-పగఱు" మున్నగువానికి "భూయసీదేశ్యశబ్దేషు।లోపవర్ణాగమశ్రుతిః" అను నథర్వణకారిక యేగతి (౮౮ I విష.) యనఁదగును.

నిత్యం దారాదేశ్చ।స్యాల్లో ర్లలయో రురౌచ తత్ర
స్తః।(ఆం. చిం. అజం. ౧౮ కా. అహో. 3౨౭ పు.)

నన్నయా. ఉతోలోపశ్చ (వికృ. అజం ౫౨ కా. అహో. 3౨౯)

౧౯౮ విషయము. తయోశ్శసాదౌ రేమాత్ర। ఉదతోః ప్రాయశోఽత్ర
ఇత్. (వికృ. అజం. 3౬ కా. అహో. 3౧౦ పు.)

కల్పతరు. ౧౯౮ విషః—ఈకారికలు వ్యాఖ్యాతచరములు. (౧౯౨ విష.) ఆలు మున్నగుశబ్దముల లు వర్ణస్థానమున బహువచన లులపరకత్వమున నిత్యముగాఁ బూర్ణబిందు పూర్వక డువర్ణాదేశ మగుననియు నట్టిబహువచన 'లుల'లకు నిత్యముగా రురలాదేశ మగుననియు నట్టియాదేశ డువర్ణములోని 'ఉకారము' పాక్షికముగా లోపించుననియు ద్వితీయాద్యేకవచనపరకత్వమున నాల్వాదుల లువర్ణము నుత్వమున కిత్వమగుననియుఁ బయికారికలలోఁ బ్రకృతవిషయమును సంబంధించిన భాగమున కభిప్రాయము నెన్నునది. ఉదా:—ఆలు - ఆండురు = ఆంద్రు. ఆలిఁ - ఆండురఁ = ఆంద్రఁ. కోడలు - కోడండురు = కోడంద్రు. కోడలిఁ - కోడండురఁ = కోడంద్రఁ. మొ. ఆలు - కోడలు - మఱఁదలు - చెల్లెలు - చెలియలు. ఇవి యాల్వాదులు. ౧౯౨ విష. కల్పతరువున వివరింపఁబడినరీతి సహోబలపండితుని సమన్వయముచొప్పున నాలుప్రభృతుల లువర్ణస్థానమున నిత్యడువర్ణాదేశమును నద్దానియుత్వమునకును నిత్యలోపమును గల్గునపుడు "ఆలు - ఆంద్రు" అనురీతినె రూపసిద్ధియగును. 'ఆండురు' మున్నగురీతిని రూపసిద్ధి కల్గనేరదు. కాని యట్టి డువర్ణోల్లోపనిత్యత నన్నయాథర్వణసమ్మతము కామింజేసి (౧౯౨ విష.) యట్టిసమన్వయము గ్రాహ్యము కానేరదు. ముందు నిర్ణయింపఁబడురీతిని "కోడంద్రురయందు" మున్నగు

